కాలాన్ని మహిమాన్విత శక్తిగా మలిచే

# కాలచక్ర తంత్రం

2006 జనవరి కాలచక్ర తంత్ర దీక్షాప్రదాన మహోత్సవాన్ని కళ్ళకు కట్టినట్లు చూపించే తెలుగు గ్రంథం

(ఆంధ్రజ్యోతి దిన పత్రికలో వెలువడిన ధారావాహిక)

సంకలనం

డా|| జి.వి.పూర్ణచంద్

(ప్రముఖ ఆయుర్వేద వైద్యుడు, కవి, చరిత్ర పరిశీలకుడు)

శ్రీమధులత పబ్లికేషన్స్

డోర్. నెం. 28-3-49, సంజీవయ్య కాలనీ,
అరండల్‌పేట, విజయవాడ - 520 002

# KALACHAKRA TANTRAM

Compiled by :

**Dr. G.V. Purnachand, B.A.M.S.,**

Susruta Ayurvedic Speciality Hospital

Ist floor, Satnam Towers,

Opp. Buckinghampet Post Office,

Governorpet, Vijayawada - 520 002

Ph : 0866-5568185, Mobile : 94401 72642



1st Edition :

January, 2006

Price : **30/-**

Cover Design & Type Setting :

**SREE MADHULATHA GRAPHICS**

Arundelpet, VIJAYAWADA.

Printed At :

**VAASU OFFSET PRINTERS**

Arundelpet, Vijayawada-2.

Published by :

**Sree Madhulatha Publications**

28-3-49, Sanjeevaiah Colony,

Arundalpet, Vijayawada - 520 002

Ph : 2434320 (O), 2436936 (R)

Cell : 94401 72936

# Dedication



The Story & Practice of
KALACHAKRA TANTRA
Book Dedicated to
His Holiness the Dalai Lama

# విషయసూచిక



## కాలాన్ని మహిమాన్విత శక్తిగా మలిచే

# కాలచక్ర తంత్రం

**కాలచక్రం అంటే,** ఈ సమస్త చరాచర సృష్టికీ సాక్షీభూతంగా నిలిచిన **కాలమే...! జరిగిపోయిన, జరుగుతున్న, జరగబోతున్న సృష్టి పరిణామ చక్రమే 'కాలచక్రం' అంటే!!**

టిబెట్‌కి చెందిన బౌద్ధులు ఈ కాలచక్రాన్ని ఒక తంత్రంగా- ఒక తాత్త్విక సిద్ధాంతంగా, ఒక జీవన విధానంగా ఆచరిస్తారు.

చక్రభ్రమణం అంటే, చక్రంలా గుండ్రంగా తిరగడం. అంతరిక్షంలో గ్రహాల దగ్గర నుంచి, విడవకుండా ఊపిరి పీల్చి వదిలే మానవ ఉచ్ఛ్వాస నిశ్వాసాల వరకూ సమస్తమైన సృష్టి కదలికలన్నీ ఈ కాలచక్రం పరిధిలోకే వస్తాయి.

కాలచక్రాన్ని సాధించుకోవడం అంటే, ఈ సృష్టి యొక్క స్థితిలయాల్ని సాధించుకోవడంగా అర్థం చేసుకోవాలి. కాలచక్రాన్ని సాధించుకోవడం అంటే, ఈ సృష్టిలో స్థూలంగా కన్పించే అంశాలే కాదు, సూక్ష్మమైన శక్తుల్ని కూడా సాధించుకొని, జ్ఞానాన్ని (లేక) బుద్ధత్వాన్ని పొందడం అన్నమాట!!

కాలానికి లోబడకుండా ఈ సృష్టిలో ఏదీ లేదు. అందుకని, కాలదేవత లేదా కాలపురుషుడు ఆధీనంలో ఈ సృష్టి నడుస్తోందని కాలచక్ర సిద్ధాంత కర్తలు భావిస్తారు.

చక్రానికి మొదలు, చివర అనేవి వుండవు. "ఆద్యంతాలు లేని స్థితి"ని చక్రం అంటారు. ఈ కాలానికి మొదలు ఎప్పుడో, చివర ఎప్పుడో నిర్ణయించడం సాధ్యం కాదు- అందుకని దీన్ని కాలచక్రం అన్నారు. దీనికి అధిష్ఠానదేవత కాలపురుషుడు!



టిబెట్ భూభాగంలో నాలుగు రకాల బౌద్ధ ధర్మాలు ఆచరణలో వున్నాయి. ఈ నాల్గింటి లోనూ కాలచక్ర ముఖ్యమైనదైనప్పటికీ, 'కాలచక్ర సిద్ధాంతం' పేరుతో ప్రత్యేకమైన బౌద్ధ ప్రక్రియ బాగా వ్యాప్తిలో వుంది. "గెలుగ్" పద్ధతి అంటారు టిబెట్ భాషలో ఈ కాలచక్ర పద్ధతిని.

'టిబెట్' అనేది ఒక బౌద్ధ మహా సామ్రాజ్యం. దాన్ని చైనా ప్రభుత్వం ఆక్రమించినప్పటికీ బౌద్ధమతాధిపతి అయిన 14వ దలైలామా భారతదేశంలో శరణు పొందుతూ, ప్రవాస ప్రభుత్వాన్ని నడుపుతున్నారు.

ఈనాటి 14వ దలైలామాకి పూర్వం వున్న దలైలామాలంతా కాలచక్ర పద్ధతిని ప్రోత్సహించినవారే అయినప్పటికీ, ఒకటవ, రెండవ, ఏడవ, ఎనిమిదవ, దలైలామాలు కాలచక్ర విధానాన్ని బాగా అనుసరించిన వారు. ప్రస్తుత 14వ దలైలామా విస్తృతంగా ఈ విధానానికి ప్రచారం కల్పిస్తున్న వ్యక్తి.

# జొనంగ పా విధానం

ప్రాచీన బౌద్ధ ధర్మాలన్నీ పాళీ భాషలో ఎక్కువగానూ, ప్రాకృతం, సంస్కృతం, బ్రాహ్మీ భాషలో తక్కువగానూ కన్పిస్తాయి. భారత దేశంలో బౌద్ధమతానికి ప్రాధాన్యత తగ్గి శైవమతం, వైష్ణవమతం విజృంభించిన కాలంలో, బౌద్ధం రాజాదరణతో పాటు, భారతీయుల జనాదరణకు కూడా వివిధ కారణాల వలన దూరం అయ్యింది.



కానీ, భారతదేశం వెలుపల టిబెట్, నేపాల్, చైనా, జపాన్, థాయ్‌లాండ్ వంటి దేశాలలో బౌద్ధం ఈనాటికీ వర్ధిల్లుతోంది. టిబెట్ ఈ మతానికి అధికార కేంద్రంగానూ, దలైలామా బౌద్ధ మతాధిపతిగా, టిబెట్ వలన సామ్రాజ్య పాలకుడిగా కొనసాగుతున్నారు.

జొనంగ్ లేదా జొనంగపా విధానం ఈ కాలచక్ర తంత్రానికి ప్రధాన కేంద్రంగా వుంది. బౌద్ధ మతానికి చెందిన పదాలన్నీ ప్రపంచ వ్యాప్తంగా విస్తృతంగా వ్యాప్తిలో వున్నాయి ఇప్పుడు. వీటిలో టిబెట్ పదాలే ఎక్కువగా వుండడం ఒక విశేషం!

కాలచక్ర తాంత్రిక విధానాలన్నీ 'జొనంగ పా' బౌద్ధ విధానాన్ని అనుసరించి జరుగుతున్నాయని మొదటగా గుర్తుంచుకోండి. పోనుపోనూ ఈ పదాలన్నీ మనకూ అలవాటైపోతాయి.

కాలం రహస్యాన్ని ఛేధించడం కోసం మనం కూడా కాలచక్ర తంత్రాన్ని అధ్యయనం చేయవలసిన అవసరం ఎంతయినా వుంది. పుస్తక ప్రియులైన మీరు కొంచెం మనసు పెట్టి ఈ పుస్తకం చదవండి. చాలా విశేషాల్ని గ్రహించవచ్చు.

# కాలం రహస్యాన్ని కనుగొందాంరండి!!

భారతదేశంలో గానీ, పాశ్చాత్యదేశాలలో గానీ, జ్యోతిష్య శాస్త్రం, ఖగోళ శాస్త్రాలు కాలచక్రాన్ని గ్రహాల గమనాన్ని బట్టి, అవి వున్న స్థితిని బట్టి అంచనా వేస్తాయి. ఇవన్నీ గుణకారాలకు సంబంధించిన అంశాలు. అంటే, లెక్కలు కట్టి తేల్చే సంగతులు. బౌద్ధ మతానికి సంబంధించిన 'కాలచక్రం' అనే తాంత్రిక విధానం ఇలా లెక్కలకు సంబంధించినదిగా వుండదు.

కాలచక్రం కోసం మనం అంతరిక్షంలోకి వెళ్ళనవసరం లేదు. ఆ అంతరిక్షం మనలోనే వున్నదంటుంది కాలచక్ర తంత్రం.

మనం ఎలా పుట్టాం...? కాలం మనల్ని తయారుచేసింది. కాలం ఒక పదార్థం. అందులోంచి మనం తయారయ్యాం.

"కాలం ఒక మహా ప్రవాహం. అది నన్ను ఒక చోటు నుంచి ఇంకొక చోటుకు తీసుకువెడుతోంది. కానీ, నేనే ఆ నదిని! నన్ను తినేయడానికి పెద్ద పులి పొంచి వుంది. కానీ, నేనే పెద్దపులిని. నన్ను దహించడానికి అగ్ని రాజుకొంటోంది. నేనే ఆ అగ్నిని..." అంటుంది కాలచక్ర తంత్రం. ఇలా చదువుతుంటే, మనకి ఏమీ అర్థం కానట్టు గందరగోళంగానే వుంటుంది. అందుకే మనం మరింత సరళమైన రీతిలో దీన్ని అర్థం చేసుకోవడానికి ప్రయత్నిద్దాం. "కాలం" రహస్యాన్ని కనుక్కోవడం కదా మన లక్ష్యం...!

కాలచక్ర తంత్రాన్ని ఒక యోగతంత్రంగా భావించవలసి వుంది. దీన్ని "అనుత్తర యోగం" అని కూడా అంటారు.

కాలాన్ని అధ్యయనం చేయవలసి వచ్చినప్పుడు, బుద్ధుని బోధలను అనుసరించి చూడాలి. హేతువాద దృష్టితో చూడాలి. సైన్సు దృష్టితో చూడాలి. ఆధ్యాత్మిక దృష్టితో చూడాలి. సామాజిక దృష్టితో చూడాలి.

ఇన్ని దృష్టి కోణాల నుంచి కాలరహస్యాన్ని తెలుసుకోవడం కోసం సహజంగానే యోగసాధకుడు ప్రయత్నిస్తున్నప్పుడు, మామూలుగా చెప్పుకునే బౌద్ధ ధర్మాల నుంచి కొంత ఇవతలికి రావాల్సి వస్తుంది. అయినా, మౌలిక బౌద్ధ ధర్మాలకు విరుద్ధం కాని రీతిలో కాలచక్ర తంత్రం సాగుతోందనేది ముఖ్య విషయం.

# నలందా విశ్వవిద్యాలయంలో కాలచక్రతంత్రం ఒక కోర్సు

క్రీస్తుశకం తొలి శతాబ్దాల కాలంలో, నలందా బౌద్ధ విశ్వవిద్యాలయం ఎంతో కీర్తిమంతంగా వెలుగుతోన్న రోజుల్లో, అంటే రెండువేల ఏళ్ళక్రితం- కాలచక్ర తంత్రాన్ని నేర్పించే ఒక శాఖని ఇక్కడ ప్రారంభించారు. అప్పుడు కాలచక్ర తంత్రం బౌద్ధ మతానికి విరుద్ధమైనదనే వివాదం బయల్దేరి, ఎంతో లోతుగా వాద ప్రతివాదాలు జరిగాయి. ఆ తర్వాత బౌద్ధ పండితులంతా నూరుశాతం బౌద్ధమే ఈ కాలచక్ర తంత్రం అని అంగీకరించి, పాటించి, వ్యాప్తి చేయడం మొదలు పెట్టారు.



సిద్ధ నాగార్జునుడు వంటి బౌద్ధ శాస్త్రవేత్తలు 'మహాయాన బౌద్ధం' అనే సిద్ధాంతాన్ని ప్రచారం చేస్తున్న కాలం అది! నాగార్జున సాగర్ దగ్గర నదిలో కొంత మునిగి వున్న 'నాగార్జున కొండ'ని ఆ రోజుల్లో శ్రీ పర్వతం అనేవారు. ఈ శ్రీ పర్వతం కేంద్రంగా మహాయాన బౌద్ధం వర్ధిల్లింది. ఈ కాలచక్ర తంత్రం మహాయాన బౌద్ధ ధర్మానికి ఒక ప్రధాన వేదికగా నిలిచింధని బౌద్ధ పండితులంటారు. ఆ తర్వాత కాలచక్ర తంత్ర ప్రచారమే ధ్యేయంగా వజ్రయాన బౌద్ధం బయల్దేరింది.

పరిత్యాగం (Renunciation) బోధిచిత్తం, సర్వశూన్యత (Emptiness) బుద్ధత్వం (Enlightenment) అనే బౌద్ధ విధానాల ఆధారంగానే కాలచక్ర తంత్రం రూపొందింది కాబట్టి, మొదట్లో ప్రతిఘటన కన్పించినా ఆ తర్వాత అది ప్రముఖ బౌద్ధ యోగ తంత్రంగా వెలిగిందన్న మాట!

పంచమహాభూతాలైన పృధ్వి, జలం, అగ్ని, వాయువు, ఆకాశాలతో పాటు బుద్ధినీ లేదా జ్ఞానాన్ని (Wisdom) కూడా ఒక మహాభూతంగా పేర్కొన్న కాలచక్రతంత్రం గురించి, మేధావులైన వారు అధ్యయనం చేయవలసిన సమయం ఇది.

ఇందులో బౌద్ధమతానికి భిన్నమైన ఇతర మతసిద్ధాంతాలు కూడా కొంతవరకూ కన్పిస్తాయి. అదే ఈ తికమకకు కారణం. వాటిని బౌద్ధం అంగీకరించకపోయినా కాలచక్రతంత్రం అంగీకరిస్తోందన్న మాట.

మహాయానం తర్వాత "వజ్రయానం" కాలచక్ర సిద్ధాంతానికి మరింత పరిపుష్టినిచ్చింది. సాంఖ్య వైశేషిక తర్కశాస్త్రాలు, పురాణాలు, జైనం, బౌద్ధ అభిధర్మ సూత్రాలు- ఇంకా అనేక హిందూ తర్క శాస్త్రాలలోని పదజాలం అంతా కాలచక్ర తంత్రంలో కన్పిస్తుంది. అంటే, అనేక రకాల సైన్సు విజ్ఞాన శాస్త్రాల సమాహారంగా ఈ కాలచక్రతంత్రం రెండువేల ఏళ్ళకు పూర్వమే ఏర్పడి ఈనాటికీ జ్ఞానులైన పెద్దల చేత ఆచరించబడ్తోందని మనం అర్థం చేసుకోవాలి.

మన జీవిత రహస్యాల్ని మనం అర్థం చేసుకోవడానికి మనలో ఒక కొత్త ఆలోచన రగిలించడానికి ఈ కాలచక్రతంత్రాన్ని అర్థం చేసుకోవడానికి ప్రయత్నించడం ఒక అవసరం!

# ప్రాచీన భారతీయ వైజ్ఞానిక ప్రగతికి బౌద్ధుల పాత్ర

ఆయుర్వేదశాస్త్రం అభివృద్ధి కోసం బౌద్ధులు చేసిన కృషి ఈ నాటి తరానికి అంతగా తెలియదు. రస ఔషధాలను వినియోగంలోకి తెచ్చిన తర్వాత వివిధ లోహాలను విషాలను అతి తక్కువ మోతాదులో ప్రయోగించడం ద్వారా వ్యాధుల్ని అతిత్వరగానూ, అతిసమర్థతతోనూ తగ్గించే అవకాశం ఏర్పడింది. బౌద్ధులైన ఆచార్యులే ఈ రసతంత్ర విజ్ఞానాన్ని ఎక్కువ పరిశోధించి అభివృద్ధి చేశారు. కాలచక్రతంత్రంలో ఆయుర్వేదానికి చెందిన పరిభాషకూడా బాగా కన్పిస్తుంది.

వైదిక మతంలో కొన్ని విప్లవాత్మక పరిణామాలే బౌద్ధమతంగా రూపొందాయి. ఒకదశలో, ఆనాటి భారత దేశం అంతా బౌద్ధమతంగానే వుంది. అప్పుడు బ్రాహ్మణిజంగా పిలువబడే "చాతుర్వర్ణ వ్యవస్థ"ను ప్రతిపాదించిన వైదికమతం చాలా నీరస స్థితిలో వుండేది.

ఆ దశలోనే భారతదేశంలో అనేక శాస్త్రాలు బౌద్ధుల కారణంగా అభివృద్ధి చెందాయి. "ప్రాచీన భారత వైజ్ఞానిక ప్రగతి" అనేది కన్పించిన యుగం అది! ఆయుర్వేదం, జ్యోతిష్యం, ఖగోళశాస్త్రాలు, వృక్షాయుర్వేదం, గణిత శాస్త్రాలలో బౌద్ధ పండితులు రాసినవే ఎక్కువగా కన్పిస్తాయి. ప్రాచీన భారతీయ వైజ్ఞానిక ప్రగతికి బౌద్ధుల పాత్ర గణనీయమైనదే! దేశం అంతా ఒకే కులం- ఒకే మతంగా వున్నాయి. విజ్ఞానం ప్రధానంగా నడిచినయుగం అది!

బౌద్ధం వెనకడుగు వేశాక, క్రీస్తుశకం ఆరు- ఏడు శతాబ్దాల తర్వాత వైదికమతం తిరిగి ప్రాణం పోసుకొంది. బౌద్ధమతం ఈ దేశం నుంచి క్రమేణా నిష్క్రమించడం మొదలు పెట్టింది.

బౌద్ధ భిక్షువుల్ని నిర్దాక్షిణ్యంగా అంతమొందించగా ప్రాణభయంతో విదేశాలకు ప్రవాసం వెళ్ళిపోయిన కొందరు బౌద్ధ భిక్షువులు తమతో తీసుకువెళ్ళిన బౌద్ధ గ్రంథాలే ఈనాటికీ నిలిచివున్నాయి. కాబట్టి, వాటిలో ఆనాటి చారిత్రక విశేషాలు, సామాజిక జీవనం నిక్షిప్తంగా వుంది. కానీ, భారతదేశంలో వైదిక పండితులు బౌద్ధ గ్రంథాల అవశేషాలు కూడా మిగలకుండా చేశారనే ఆరోపణ సత్యదూరమేమీ కాదు!

క్రీస్తు శకానికి ముందు 3 శతాబ్దాలు, తర్వాత మూడు శతాబ్దాలు బౌద్ధ, జైన మతాలకు స్వర్ణయుగం. ముఖ్యంగా ఆనాటి ఆంధ్రదేశంలో బౌద్ధమతం జైనమతం కల్గించిన ప్రభావాలు ఈనాటికీ కన్పిస్తాయి. తెలుగువారి దేవతలు, సంస్కృతి ఆచార వ్యవహారాలపైన బౌద్ధమత ప్రభావం బాగా వుందనేది ఇక్కడి ముఖ్యవిషయం!

# హిందూ మతంపై బౌద్ధ ప్రభావం

వేదాలు, వైదిక సంస్కృతి బుద్ధుడి కన్నా పూర్వకాలం నాటివేననడంలో ఎటువంటి సందేహం లేదు. కానీ, హిందూ మతంగా పిలువబడ్తున్న ఈనాటి హిందూ సంస్కృతి పురాణాల ఆధారంగా ఏర్పడింది. పురాణాలు చారిత్రకంగా బుద్ధుడి తర్వాత ఏర్పడినవే!

అందుకని, హిందూ ధర్మాల మీద బౌద్ధ జైన మతాల ప్రభావం ఎంతయినా వుండటం సహజం.



తెలుగు ప్రజల వరకే తీసుకోండి, బ్రాహ్మణులు, వైశ్యులు, విశ్వ బ్రాహ్మణులు... వీళ్ళంతా ఈనాటికీ శాకాహారులు గానే వుండటానికి బౌద్ధ మతం (లేదా) జైనమతం ప్రధాన కారణం. బౌద్ధులు లేదా జైనులు వైదిక మతాన్ని స్వీకరించినా, అంతకు మునుపటి జీవిత విధానాన్ని మార్చు కోలేక, అదే అలవాటు ఈనాటికీ కొనసాగిస్తున్నారని అర్థం చేసుకోవచ్చు.

మతపరంగా మద్యపానాన్ని, జంతు హింసనీ హిందూమతం ఖండించడాని క్కూడా బౌద్ధమతం ప్రభావమే ముఖ్య కారణం. వేదకాలంలో మాంసాహారం, మద్యపానం, జంతుబలులు పవిత్ర కార్యాలుగానే కొనసాగాయి. కానీ బౌద్ధమతం జైనమతాల తర్వాత హిందూమతంలో అవి నిషేధానికి గురి అయ్యాయి.

అనేక కారణాల వలన బౌద్ధమతం అంతరించిపోయిన తర్వాత వైష్ణవమతం బుద్ధుడి బోధనలలో కొన్నింటిని ప్రధానంగా తీసుకొని వ్యాప్తిలోకి వచ్చిందని ప్రముఖ పరిశోధకుడు యల్.యమ్.జోషి రాశారు.

బుద్ధుడు ప్రవచించిన పరిత్యాగం (Renunciation) అనేది వైదిక ధర్మాలకు ముఖ్య కార్యాచరణ అయ్యింది. బుద్ధుడి బోధనల్నే కాదు, బౌద్ధ ఆరామాల్ని కూడా వైదికులు ఆక్రమించారు.



# అమరావతి ప్రాముఖ్యం

బౌద్ధమతానికి ఎంత వయసుందో గుంటూరు జిల్లా అమరావతి సమీపంలో వున్న ధాన్యకటకానికీ అంతే వయసుంది. అక్కడ దొరికిన బౌద్ధ స్థూపం శిధిలాలక్కూడా అంతే వయసుంది!



క్రీ.పూ. 3వ శతాబ్దిలో మౌర్య చక్రవర్తి అశోకుడుతో ప్రారంభించి దాదాపుగా 14వ శతాబ్ది వరకూ ఇక్కడ బౌద్ధ మత విస్తృతి నడిచిందని చరిత్ర!

కృష్ణాతీరాన్ని పాలించిన వివిధ పాలకుల ఏలుబడి, వారు చూపించిన ఆదరణ, నిరాదరణల్ని తట్టుకొని ఈ బౌద్ధ స్థూపం దాదాపు 1700 సంవత్సరాల పాటు నిలబడింది. ఆ తర్వాత ఒరిగిపోయి మట్టితో కప్పబడిపోయి ఒక మట్టి దిబ్బలా మిగిలిపోయింది. 1800 సంవత్సరం వరకూ అది మట్టిదిబ్బే!! ఈ చిత్రంలో మనం చూస్తున్న స్తూపం కేవలం ఒక ఊహా చిత్రం... అలా వుండి వుండవచ్చని!

అశోకుడు కృష్ణాతీరానికి తన రాజ్యాన్ని విస్తరించే నాటికే ఇక్కడ బౌద్ధమతం వున్నదనడంలో ఇప్పుడు చరిత్రకారుల మధ్య భిన్నాభిప్రాయం లేదు.

అమరావతి బౌద్ధ స్తూపం ఖచ్చితంగా ఏ శతాబ్దిలో కట్టబడిందనేది నిర్ణయించడం కష్టం. అయితే, అది కట్టబడే నాటికి నాగరకులు, విజ్ఞానవంతులు, ధనవంతులు అయిన ప్రజావ్యవస్థ అక్కడ వుండేదని ఊహించడానికి అనువైన అనేక శిల్పాలు ఈ బౌద్ధస్తూపంలో దొరికాయి.

ఈ స్థూపం అంతా ఒకేసారి నిర్మితం అయివుండక పోవచ్చు. ఇంచుమించు 17 శతాబ్దాల కాలంలో అనేకమంది ప్రభువులు. ప్రజలు లేదా బౌద్ధ భిక్షువులు ఈ స్తూపాన్ని ఎప్పటికప్పుడు మరమ్మత్తులు చేసి కొత్త నిర్మాణాలు సమకూర్చి నిలబెట్టుకుంటూ వచ్చి వుంటారు.

నిజానికి దక్షిణ ఆసియా దేశాలతో వర్తక వాణిజ్యాలు నెరపిన వ్యాపార ప్రముఖులు ఈ స్తూప నిర్మాతలు. వాళ్ళలో కొందరి పేర్లు కూడా అక్కడక్కడా చెక్కబడి వున్నాయంటారు.

ఈ స్థూపం నిర్మాణం మహాయాన బౌద్ధం కాలంలో జరిగి వుంటుందని అంచనా! అంటే క్రీస్తుశకం 3వ శతాబ్దివరకూ దీని నిర్మాణం జరిగిందని చారిత్రకవేత్తలంటారు.

7వ శతాబ్దిలో హ్యూన్‌త్సాంగ్ అనే చైనా యాత్రికుడు అమరావతిని సందర్శించే నాటికి ఇక్కడ బౌద్ధం అంతరించే దశలో వుండి, శైవం బాగా వ్యాప్తిలో వున్నదట. అయినప్పటికీ 20 బౌద్ధారామాల వరకూ ఈ ప్రాంతాల్లో 7వ శతాబ్ది నాటికి సజీవంగా వున్నాయని హ్యూన్‌త్సాంగ్ రాశాడు. అంటే, ఊహాచిత్రంలో చూసిన అమరావతి స్తూపాల వంటి స్తూపాలు అనేకం అక్కడ ఒకప్పుడు వుండి వుంటాయి. వాటి శిధిలాల మీదే ఈనాటి అమరావతి నగరాన్ని నిర్మించారు. అందువలన త్రవ్వకాలు జరిపే అవకాశాలు కూడా లేకుండా పోయింది.

1344లో ఒక సింహళదేశపు (శ్రీలంక) బౌద్ధ భిక్షువు అమరావతి వచ్చాడు. దీనస్థితిలో వున్న ఈ బౌద్ధ స్తూపానికి ఆయన కొంత మరమ్మత్తులు చేయించినట్లు శ్రీలంకలో దొరికిన కొన్ని ఆధారాల్లో వున్నదట!

1796లో వాసిరెడ్డి వెంకటాద్రినాయుడు, బ్రిటిష్ ఈస్టిండియా కంపెనీ వారు అతని రాజధాని నగరం చింతపల్లిని ఆక్రమించినప్పుడు ఈ బౌద్ధ స్తూపానికి సమీపంలో ఒక కోటని కట్టుకొని రాజధాని నగరాన్ని ఇక్కడకు తరలించాడు. ఆ సమయంలో మట్టి కోసం ఆ పక్కనే వున్న దిబ్బని తవ్వినప్పుడు, అందులో నిక్షిప్తమై వున్న ఈ బౌద్ధ స్తూపం శిలా ఫలకాలు బయటపడ్డాయి. పోయినన్ని పోగా, ఏవో కొన్ని మాత్రమే మిగిలితే మద్రాస్ మ్యూజియంలోనూ, బ్రిటిష్ మ్యూజియంలోనూ

వాటిని భద్రపరిచారు 1797లో కొల్‌నెల్ మెకెంజీ వీటిని బౌద్ధస్తూపం తాలూకు శిలాఫలకాలుగా మొదట గుర్తించాడు. అప్పటి నుంచి ఈ స్తూపం అమరావతి స్తూపంగా పిలువబడ్తోంది. ఇప్పుడక్కడ స్తూపంగానీ, స్తూపం శిధిలాలు గానీ ఏమీ లేవు. వాటి చరిత్ర మాత్రమే అక్కడక్కడా కొన్ని గ్రంథాల్లో కన్పిస్తోంది.

# అమరావతిలో కాలచక్ర తంత్రం

ప్రజ్ఞాపరిమిత సూత్రాలు, విమలకీర్తి నిర్దేశిత సూత్రాలు- మహాయాన బౌద్ధ ధర్మాలు క్రీస్తు శకం ఒకటి నుంచి నాలుగవ శతాబ్దివరకూ అమరావతి బౌద్ధ విహారం కేంద్రంగా వ్యాప్తిలో వుండేవి.

"బోధిసత్వ విమలకీర్తి" అతి సామాన్య పౌరుడిలా సంచరించేవాడట. బుద్ధుడంతటి వాడని ఆయనకు పేరు. ఆయన బోధించిన విమలకీర్తి నిర్దేశ సూత్రాలు తెలుగువారు బౌద్ధ ధర్మానికి అందించిన ముఖ్య సూత్రాలని అంటారు.



క్రీస్తుశకం 1వ శతాబ్దిలో సుఖవతి వ్యూహసూత్రాలు, 2వ శతాబ్దిలో సద్ధర్మ పుండరీక సూత్రాలు వెలువడ్డాయి. క్రీ.శ.150-250 మధ్య కాలంనాటి సిద్ధ నాగార్జునుడు నాగార్జునకొండ (శ్రీపర్వతం) కేంద్రంగా బౌద్ధమతాన్ని విస్తృతపరిచాడు.

ప్రజ్ఞాపరిమిత సూత్రాల్ని ఈయన నాగుల నుంచి తిరిగి స్వాధీనం చేసుకొని బౌద్ధులకు అందించాడని ఒక కథ ప్రచారంలో వుంది. ఈ ప్రజ్ఞాపరిమిత సూత్రాల ఆధారంగానే మహాయన బౌద్ధం ప్రబలింది.

"చిత్తమాత్ర" మనసొక్కటే అనే గ్రంథం కూడా ఆచార్య నాగార్జునుడు వెలయించాడంటారు. "లంకావతార సూత్రాలు" "గుహ్య సమాజ సూత్రాలు" ఆ రోజుల్లో భారతదేశంలోనే కాక బౌద్ధ ధర్మాలు పాటించే దేశాలన్నింటిలోనూ వ్యాప్తిలో వుండేవి. ఇవి తెలుగువారైన బౌద్ధులు బౌద్ధ ప్రపంచానికి అందించిన గొప్ప సాహిత్య సంపద!

కాలచక్రతంత్ర గ్రంథాల్లో వున్న ఆధారాల ప్రకారం, బుద్ధుడు తానే నాలుగు ముఖాలున్న కాలపురుషుడి రూపంలో నాలుగు ముఖాల లోంచి నాలుగు విభాగాల్ని వివరిస్తూ, ధాన్యకటకం లోని ఈ స్థూపం దగ్గరే కాలచక్రతంత్రాన్ని బోధించాడని స్పష్టంగా తెలుస్తోంది.

అమరావతి, నాగార్జునకొండల తర్వాత "పోటల" అనే ప్రాంతం తెలుగు నాట ప్రసిద్ధ బౌద్ధ క్షేత్రంగా వుండేదని ఈ కాలచక్రతంత్రంలో వుంది. ఈ 'పోటల' ఏదో స్పష్టంగా ఎవరూ నిర్ధారించలేదు. 'పోతర్లంక' అని దివిసీమలో ఒక గ్రామంలో తారాదేవి విగ్రహం దొరకడంతో బహుశా ఈ కుగ్రామం ఒకప్పటి పోటల కావచ్చని కొందరు వూహించారు. ఇది కృష్ణకు దక్షిణ తీరంలో భట్టిప్రోలుకు దగ్గరగా వున్న ప్రాంతం. భట్టిప్రోలుకే పూర్వం 'పోటల' అనే పేరు వుండి వుండవచ్చుకూడా!

ఏమైనా, బుద్ధుడు స్వయంగా కృష్ణా తీరానికి వచ్చాడని, అమరావతిలో బౌద్ధ స్థూపం వున్నచోట ఆ రోజుల్లో ఏదైనా చిన్న ఆరామం వుండి వుంటుందని, బుద్ధుడు అక్కడ కొన్నాళ్ళుండి బౌద్ధభిక్షువుల చేత కాలచక్రతంత్రం అక్షరాభ్యాసం చేయించి వెళ్ళాడని మనం ఊహించడానికి కాలచక్రతంత్రమే ఆధారం.



# కాలచక్రతంత్రం ఏ కాలానిదో...???

ఆనాడే కాదు, ఈనాటి అత్యాధునిక బౌద్ధ పండితులు కూడా, కాలచక్రతంత్రం అనేది బౌద్ధమతం ఆవిర్భవించడానికి చాలా ముందు కాలం నుంచే వైదిక ధర్మాల్లో వుందని భావించేవారున్నారు.



అందుకనే, వేదాలు, శైవం, సాంఖ్యం, వైష్ణవం, ఉపనిషత్తులు, పురాణాలు, జైనం కూడా ఈ కాలచక్రతంత్రంలో మనకు చాలాచోట్ల కన్పిస్తాయి. హిందూ, జైన, బౌద్ధ దేవతలు కూడా ఈ తంత్రంలో మనకు కన్పిస్తారు. మాండూకోపనిషత్తు, జైనమతం చెప్పిన అంశాలు ఇందులో ఎక్కువగా కన్పిస్తాయి. ఈ గ్రంథాల్లో చెప్పిన పదాలు కూడా యథాతథంగా కాలచక్రతంత్రంలో వాడడం జరిగింది. కానీ, ఆయా పదాలకు కాలచక్రతంత్రం చెప్పిన అర్థాలు వేరుగా వుంటాయి. ఇది చాలా ముఖ్యమైన విషయం!

కాలచక్రతంత్రం శాక్యముని బుద్ధుడి కాలాన్ని లెక్కగట్టి క్రీస్తుపూర్వం 9వ శతాబ్ది నాటివాడుగా నిర్ధారిస్తుంది. అయితే, బౌద్ధ చరిత్రకారులు గానీ, ఇతరులు గానీ, బుద్ధుడి కాలాన్ని ఆరవ శతాబ్దంగా ఎక్కువమంది అంగీకరిస్తున్నారు.

బుద్ధుడు కాలచక్రతంత్రాన్ని బోధించింది తను జ్ఞాన బుద్ధుడిగా మారిన ఒక సంవత్సర కాలంలోనని కొందరు పండితులు భావిస్తే, తాను ఇంకొక సంవత్సర కాలానికి నిర్యాణం చెందుతాడనగా అప్పుడు బోధించి వుంటాడని మరి కొందరంటారు.

బుద్ధుడు తన జీవితం చరమాంకంలోనే కాలచక్ర తంత్రాన్ని బోధించాడని ప్రస్తుత 14వ దలైలామా సిద్ధాంతీకరిస్తున్నారు.

శంభల రాజు సుచంద్రుడి ప్రార్థన మీద, శాక్యముని బుద్ధుడు తానే కాలచక్ర పురుషుడిగా, ఒక బౌద్ధ మహాసభను ఏర్పరచి, అందులో పాల్గొన్న వారందరికీ నేర్పించాడనీ, కాలచక్రతంత్రం ఆధారంగా తెలుస్తోంది. ఈ మహాసభని బుద్ధుడు ధాన్యకటకంలో నిర్వహించాడట.

ధాన్యకటకం అంటే ఏదనే విషయం మీద అనేక సంవత్సరాలుగా తర్జనభర్జనలు సాగాయి.

ఈనాడు అమరావతిగా పిలువబడ్తున్న ప్రాంతానికి అతి సమీపంలో ఈ ధాన్యకటకం వుందనీ, దాన్ని మధ్య యుగంలో ధరణికోట అని కూడా పిలిచేవారనీ పరిశోధకులు నిర్ధారించారు.



# భవిష్యత్తు చెప్పిన కాలచక్ర గ్రంథాలు



"కాలచక్రతంత్రం భవిష్యత్తులో జరిగే అనేక సంఘటనల్ని రికార్డు చేసింది. అనేక చారిత్రక విషయాలు సరిగ్గా అదే సమయానికి జరిగి, నిజమయ్యాయి కూడా.

మొదటి కల్కిరాజు మంజుశ్రీ కీర్తి కాలచక్ర లఘుతంత్రాన్ని పునర్నిర్మించినప్పుడు అందులో పేర్కొన్న వాటిలో టిబెట్ మీద చైనా ఆటవిక పాలన గురించి, టిబెట్‌లో బౌద్ధం అంతరించిపోవడం గురించి ప్రస్తావన వున్నదంటారు.

చైనా దురాక్రమణ తర్వాత టిబెట్‌లోంచి బౌద్ధమతాన్ని పూర్తిగా బైటకు వెళ్ళగొట్టింది. టిబెట్ బౌద్ధ సామ్రాజ్యానికి ఈనాటి 14వ దలైలామా భారత భూభాగంలోంచి ప్రవాస పాలన అందిస్తున్నాడు.

టిబెట్, మంగోలియా, చైనా, ఆసియాలోని అనేక దేశాల్లోంచి బౌద్ధం నిష్క్రమిస్తుందని, 800 ఏళ్ళ తర్వాత ఇలా జరుగుతుందని, 10వ శతాబ్ది నాటి మంజుశ్రీ కాలచక్రతంత్రంలో పేర్కొన్నాడనేది ఇక్కడి ముఖ్య విషయం.

క్రీ.శ.2327 నాటివరకూ ఇదే పద్ధతి కొనసాగుతుందనీ, రౌద్ర చక్రి అనే పంచెన్‌లామా టిబెట్ సింహాసనానికి వచ్చి, తిరిగి బౌద్ధ ధర్మాలకు ప్రాణ ప్రతిష్ట చేస్తాడనీ ఈ గ్రంథంలో వుందట!

హిందూ గ్రంథాలు తెల్లగుర్రం ఎక్కి కల్కి భగవానుడు అవతరిస్తాడని చెప్పినట్లే శ్రీకాలచక్రం ఎగిరే ఓడల మీద- మిస్సయిల్సో రాకెట్లో కావచ్చు- వచ్చి టిబెట్ భూభాగంలోంచి చైనా జాతివాళ్ళని, ఇతర ఆటవిక పాలకుల్ని వెళ్ళగొడ్తాడని వుంది.

బుద్ధుడి బోధనలు ఇంకా 1800 ఏళ్ళపాటు ఈ భూమ్మీద సుస్థిరంగా వుంటాయని చెప్తోంది శ్రీకాలచక్రం.

క్రీ.శ.2424లో ఒక గొప్ప ప్రపంచ యుద్ధం జరుగుతుందట. ఈ యుద్ధంలో శంబల రాజ్యానికి చెందిన యుద్ధవీరులు (ఉత్తర కాశ్మీరీ ప్రాంతం) మంచివారుగానూ ఇతర శత్రువర్గం చెడ్డవారుగానూ బుజువై నశించిపోతారు. మంచివారితో స్వర్ణయుగం అప్పటి నుంచి ఆరంభం అవుతుంది. ఇంకా నాలుగువందల ఇరవై ఏళ్ళపాటు మానవజాతి ఈ పరిణామాల కోసం వేచి వుండాలన్నమాట!

# బుద్ధుడే కల్కిగా అవతరిస్తాడు!

కల్కి 'అవతారం' కులమతాల వ్యత్యాసాలు లేకుండా చేయడమే! ఆయన తోకచుక్కని ఆయుధంగా చేసుకుని తెల్లగుర్రం ఎక్కి సంహరించేది ఈ కులమతాల భేదాభిప్రాయాన్ని మాత్రమే అంటుంది కాలచక్రం. దీన్ని తర్వాతి కాలంలో విష్ణుమూర్తి పదవ అవతారంగా చిత్రించుకున్నారు.

సహజీవనం, సాన్నిహిత్యం, శాంతి అనే వాటిని సాధించడమే కల్కి అవతార ప్రయోజనంగా బౌద్ధ ధర్మాలు చెప్తున్నాయి.

ఇదంతా మహాయానబౌద్ధం అనే బౌద్ధ విధానానికి సంబంధించింది. టిబెట్ భాషలో "సంగ్స్- ర్గ్యాస్- క్సి- రిగ్స్" అంటుంది. సంఘం ద్వారా బుద్ధ ప్రవృత్తిని (BUDHA NATURE) పెంపొందించు కోవడం అని! అదీ కాలచక్రతంత్రం లక్ష్యం !! బుద్ధ ప్రవృత్తిలో ఉన్నత గుణాలను సంతరించుకొని ప్రకాశవంతమైన బుద్ధత్వాన్ని పొందవచ్చని దీని అర్థం. Becoming a Budha అంటారు దీన్ని. అలా బుద్ధులైన వారందరిదీ ఒక్కటే కులం. అదే వజ్రకులం (Vajra Caste). ఇది బుద్ధుడి కులం (BUDHA CASTE) అంటుంది బౌద్ధ ధర్మం.

ఈ బుద్ధులు మూడు రకాలైన సాధకులుగా వుంటారు. శ్రావకులు, ప్రత్యేక బుద్ధులు, బోధిసత్త్వులు అని! బుద్ధప్రవృత్తితో బుద్ధత్వాన్ని సాధించడానికి ఇవి మూడు మార్గాలు. అంతేగాని, మూడు కులాలు ఎంత మాత్రమూ కావు!

కాలచక్రతంత్రం పద్మిని వ్యాఖ్యలో బౌద్ధేతరులైన దేవతలు, అసురులు, నాగులు, భూతాలు, మానవుల ప్రస్తావన ఉంది. 'వజ్రవేగం' అని కాలచక్రతంత్రం లోని ఒక మూల సూత్రంలో వీళ్ళ గురించి కన్పిస్తుంది. ఈ బౌద్ధేతరులకు వజ్రవేగుడు అధిపతి అని ఇందులో ఉంది. బౌద్ధేతరులైన ప్రవర్తకుల్లో కొందరు రజోగుణ ప్రధానులు, మరికొందరు తమో గుణ ప్రధానులుగా వుంటారు. బుద్ధుడిని సత్త్వగుణ సంపన్నుడుగా వర్ణించడం జరిగింది.

కాలచక్రతంత్రం ప్రకారం ఆ రోజుల్లో ఈ భూమండలం యావత్తూ సగం అసురులతోను, సగం నాగులతోను నిండివుండేదనీ అసురులు మేరు పర్వతం

దిగువున, నాగులు సముద్రాలకు దిగువున నివశించేవారనీ పర్వత ప్రాంతాల్లో అసురులు, సముద్రప్రాంతాల్లో నాగులు వుండేవారనీ వుంది.

ఒక సందర్భంలో "అసురనాగ" అని ఒకటే పదంలో ఈ రెండు రకాల ప్రజల్ని ఉదహరించడం కూడా జరిగింది- ఇది ద్వంద్వ పదం. అసురులూ, నాగులూ వేర్వేరని కొందరు వ్యాఖ్యాతలు దీని భావాన్ని విడమరిచారు.



మోజెన్, జీసెన్, మాని, ముహమ్మద్, మెహది వీరంతా నాగజాతికి చెందిన వారనీ, ఆదామ్, నోవా, అబ్రహామ్ అసురజాతి వారనీ కాలచక్రతంత్రంలో వుంది.

పద్మినీ వ్యాఖ్యానం రెండురకాల మత ప్రవర్తకులు వున్నారంటుంది. అందులో తెల్లజాతి వారికి 'మహామాయి' ముఖ్య దేవత. ఈమె అసురుల ధర్మాల్ని వ్యాపింప జేస్తుంది. మక్కా తదితర ప్రాంతాల్లో ఈమె ప్రాబల్యం వుంటుంది. తక్కిన వారు నాగులు అని ఈ వ్యాఖ్యానంలో రాసి వుంది!

పద్మిని వ్యాఖ్యానంలో సత్త్వగుణ ప్రధానులైన ఏడుగురు ప్రవర్తకుల్నీ, రజోగుణ ప్రధానమైన ఎనిమిది మంది, ఇంకా అనేకమంది తమోగుణ ప్రధాన ప్రవర్తకుల్ని వర్ణించడం జరిగింది.

సత్త్వగుణ ప్రధాన ప్రవర్తకులు కేవలం నిర్మాణాత్మకంగా మాత్రమే వ్యవహరిస్తారు. రజోగుణ ప్రధాన ప్రవర్తకుల్లో కొంత నిర్మాణాత్మకత, కొంత విధ్వంసకత రెండూ సమానంగా వుంటాయి. తమోగుణ మత ప్రవర్తకులు కేవలం విధ్వంస కారకులుగా వుంటారు.

రజోగుణ ప్రవర్తకులు తమోగుణ ప్రవర్తకుల మధ్య మతపరమైన వివాదాలు, యుద్ధాలు జరుగుతుంటాయి. సత్వగుణ ప్రవర్తకులు సాధ్యమైనంతవరకూ వీటికి అతీతంగా వుంటారు.

రజోగుణ, తమోగుణ ప్రవర్తకుల్ని ఓడించడం కోసం బుద్ధుడు, కల్కిరూపంలో వస్తాడని బౌద్ధ గ్రంధాలు చెప్తున్నాయి. 'కల్కి' పదానికి, 'కాల' పదానికి, కాలచక్రతంత్రానికీ, 'కలి' యుగానికీ చాలా దగ్గరి సంబంధాలున్నాయి. కల్కిని "వజ్రమనసు"గా భావిస్తారు. సృష్టి స్థితిలయాలన్నింటికీ అతీతంగా కల్కి వ్యవహరిస్తాడంటుంది కాలచక్రతంత్రం.

విష్ణుమూర్తి కల్కి రూపంలో వస్తాడని భావిస్తూ, ఆయన అవతారాల్ని పదింటికే పరిమితం చేసారు. 9వ అవతారంగా బుద్ధుణ్ణి పేర్కొనడం, బుద్ధుడి కల్కి అవతారాన్ని విష్ణువు పదవ అవతారం చెయ్యడం వెనక కాలచక్రతంత్ర ప్రభావం వైదిక మతం పైన ఎంతో వున్నదనడానికి సాక్ష్యంగా కన్పిస్తుంది.

సాంఖ్య యోగం కాలచక్రతంత్రానికి చాలా దగ్గరగా వున్నదనిపిస్తుంది. ప్రకృతి నుంచి మహత్తు, మహత్తు నుంచి అహంకారం, అహంకారం నుంచి పంచ మహాభూతాలు, పంచతన్మాత్రలు, త్రిగుణాత్మకమైన మనసు... ఇలా చైతన్యవంతమైన మానవుడు ఏర్పడినట్లు సాంఖ్యంలో వుంది. ప్రకృతి పురుషుల సంయోగమే సృష్టి అంటుంది సాంఖ్యం. ఆత్మ- ఇంద్రియాలు, ఇంద్రియార్థాలు మనస్సు ఈ నాలుగూ కలిస్తేనే ప్రత్యక్ష జ్ఞానం ఏర్పడుతుందని చెప్తుంది.

కాలచక్రతంత్రం, సాంఖ్య శాస్త్రం ఇంచుమించు ఒకటే చెప్తున్నాయి. వీటన్నింటి నించి విడివడిన స్థితినే (Liberation) మోక్షంగా భావిస్తారు.

కాలచక్రతంత్రం ముహమ్మద్ పుట్టిన 1800 ఏళ్ళకి మ్లేచ్ఛ ధర్మాలు ఈ భూమిని పాలించడం ఆగుతుందని చెప్పింది. పాశ్చాత్య పరిశోధకులు లెక్కగట్టి, క్రీ.శ. 2424 సంవత్సరాన్ని ఈ అద్భుతం జరిగే సంవత్సరంగా తేల్చారు.

1800 అనే సంఖ్యకి కాలచక్రతంత్రంలో చాలా ప్రాముఖ్యత వుంది. బహుశా 'కల్కి' రూపంలో అప్పుడు బుద్ధుడు తిరిగి అవతరించవచ్చు. లేదా, తెల్లగుర్రం ఎక్కి ధూమకేతువు ఆయుధంగా విష్ణుమూర్తే అవతరించవచ్చు.

ఎవరు వచ్చినా లక్ష్యం ఒక్కటే- భారత ఉపఖండం మీద దాడిచేసిన మ్లేచ్ఛ ధర్మాల్ని పారద్రోలడం. సత్వరజస్తమో గుణాలకు అతీతమైన జ్ఞాన ధర్మాన్ని వ్యవస్థాపించడం.

అందుకు 2424 సంవత్సరం దాకా గడువు వున్నదన్నమాట!

# 17 మంది
# కల్కి రాజులు

శాక్యముని బుద్ధుడు బోధించిన కాలచక్ర మూలధర్మ సూత్రాల్ని ప్రచారం చేసిన ఏడుగురు ధర్మరాజుల తర్వాత కొంతకాలానికి శంబల రాజ్యాన్ని పాలించిన మరో 17 మంది రాజుల్ని "కల్కిరాజులు" అని పిలిచారు.



కల్కి రాజుల్లో మొదటివాడు మంజుశ్రీ కీర్తి. ఈ మంజుశ్రీ కాలచక్రతంత్రాన్ని సంక్షిప్తీకరించి ప్రచారం చేశాడు. ఇలా సంక్షిప్తీకరించబడిన కాలచక్ర తంత్రాన్ని "శ్రీ కాలచక్రం" అనీ కాలచక్ర లఘుతంత్రం అనీ పిలిచారు.

శాక్యముని బోధించిన సిద్ధాంతాన్ని "పరమ ఆది బుద్ధ తంత్రం" అని కూడా పిలుస్తారు. ఇది 12వేల సూత్రాలతో వుంది. మొదటి ధర్మరాజు సుచంద్రుడు ఈ 12వేల సూత్రాలకు 60వేల శ్లోకాలతో వ్యాఖ్యానం రాశాడట.

కల్కిరాజుల కాలానికి "పరమ ఆది బుద్ధతంత్రం "చాలా భాగం లుప్తమైపోయింది. ఈ గ్రంథానికి సుచంద్రుడు రాసిన వ్యాఖ్య కూడా లుప్తమైపోవడంతో "కీర్తి విమలప్రభ శెకోద్దేశ" వంటి బౌద్ధ గ్రంథాల్లోంచి కాలచక్రతంత్రానికి సంబంధించిన భాగాల్ని ఏరి కాలచక్ర లఘు తంత్రాన్ని మంజుశ్రీ నిర్మించాడు. దీనికి "శ్రీ కాలచక్రం" అని పేరు పెట్టాడు. ఇది మొదటి "పరమ బుద్ధతంత్రం"లో నాలుగోవంతు కూడా లేదని అంటారు. చిన్నగ్రంథం కాబట్టి కాలచక్ర లఘుతంత్రం అని వ్యవహరించారు.

మంజుశ్రీ, బౌద్ధులైన ప్రజలందరినీ ఒకే తాంత్రిక కుటుంబీకులుగా ఐక్యం చేయడం కోసం ఈ శ్రీకాలచక్రాన్ని బాగా ఉపయోగించాడు. బౌద్ధానికి చెందిన శంబలదేశపు బ్రాహ్మణుల్ని ఎందరినో బౌద్ధ మతంలోకి మార్పించి కాలచక్ర అభ్యాసం చేయించాడు. తాంత్రిక కుటుంబీకులుగా మారిన వారందరినీ "వజ్ర కుటుంబీకులు" అన్నాడు.

మంజుశ్రీ తర్వాత పుండరీకుడు శంబల రాజ్యానికి పాలకుడుగా వచ్చాడు. ఈయన "విమలప్రభ" అనే బౌద్ధ గ్రంథానికి స్వయంగా వ్యాఖ్యానం రాశాడు. పాశ్చాత్యులు 'విమలప్రభ'ని "స్టెయిన్‌లెస్ లైట్" అంటారు. శ్రీకాలచక్రం, విమలప్రభ ఇవి రెండూ మూల బౌద్ధ గ్రంథాలయ్యాయి. తక్కిన గ్రంథాలన్నీ ఈ రెండింటికీ కొనసాగింపుగా ఏర్పడినవే!

బహుశా, ఈ పరిణామాలన్నీ క్రీస్తుశకం 10వ శతాబ్దిలో జరిగి వుంటాయి. ఆ సమయానికి భారతదేశంలో ఇంచుమించుగా బౌద్ధం అంతరించి పోయిందనే చెప్పాలి. కాబట్టి, ఈ పరిణమాలన్నీ కాశ్మీరుకు అవతల భాగంలో, భారతదేశానికి వెలుపల జరిగినవని గమనించాలి.

# కాలచక్ర లఘుతంత్రం

"కాల చక్ర లఘుతంత్రం"లో ఐదు అధ్యాయాలున్నాయి.

★ ఒకటవ అధ్యాయం "బయటి చక్రం" (Outer Wheel) ఇది మన చుట్టూ వున్న ఈ ప్రపంచాన్ని ఉద్దేశించింది. ఈ ప్రపంచానికి కావలసిన కాలనిర్ణయాలు, గ్రహగతులు, కేలండర్లు, ఖగోళశాస్త్ర సిద్ధాంతాలన్నీ ఇందులో వస్తాయి.



★ రెండవ అధ్యాయం "లోపలి చక్రం" (Inner Wheel) లో జీవుల పుట్టుక, శరీరం, శరీర ధర్మాల వర్గీకరణ, అనుభవాలు వీటి గురించి వుంటుంది. శరీరనిర్మాణం,

ధాతువులు, స్రోతస్సులు రసాలు. వీటికి సంబంధించిన వివరాలుంటాయి. మానవ శరీరాన్ని కాలచక్ర పరిభాషలో "వజ్రకాయం" అంటారు.

మానవ అనుభవాల్ని కూడా, మేల్కొన్నదశ, స్వప్నదశ, గాఢనిద్ర దశ, లైంగిక సుఖానుభవదశ... ఇలా నాలుగురకాలుగా విభజిస్తుంది కాలచక్రతంత్రం. ఇవి కూడా ఈ రెండవ అధ్యాయంలో చెప్పబడతాయి.

శరీరధాతువులు (Potentials) అవి. శరీర నిర్మాణానికి ఉపయోగించే విధానాలు కూడా ఈ అధ్యాయంలో చర్చించడం జరుగుతుంది.

★ మూడవ అధ్యాయం ధ్యాన్నం, యోగవిధానాలు, కాలచక్రాన్ని సాధించ డానికి చేసే దీక్షాప్రదానాల (INITIATIONS) గురించి వివరిస్తుంది. కాలచక్రానికి అక్షరాభ్యాసం చేయించడమే "ఇనిసియేషన్" అంటే!

★ నాల్గవ అధ్యాయం నిజమైన ధ్యాన పద్ధతులు, మండల ధ్యాన్న విధానాలు మరియు కాలచక్ర పురుషుడి ధ్యాన విధానాలు, ఆరు రకాల యోగ విద్యలూ చెప్పబడతాయి.

★ ఐదవ అధ్యాయంలో బుద్ధత్వాన్ని పొందడం గురించిన విషయాలు వివరించబడతాయి.

కాలచక్రతంత్రాన్ని సమర్ధవంతంగా సాధించుకోవడాన్ని "దిబాంగ్ అభ్యాసం (లేదా) సాధన" అంటారు. (dbang Initiation)

తాంత్రిక విద్యల్లో ఈ దిబాంగ్ అభ్యాసం చాలా ఉన్నతమైందని, చాలా కష్టసాధ్యమైనదనీ బౌద్ధుల నమ్మకం.

16వ శతాబ్దంలో "న్యింగ్మా పద్ధతి" వచ్చిన తర్వాత కాలచక్ర తంత్రం మరింత సరళమై, పరిపుష్టమైందని కూడా అంటారు.

ఈ టిబెట్ పేర్లు మనకు నోరు తిరగడం కష్టమే! వాటి ఉచ్చారణ కూడా మనకు బాగా తెలియదు. అంతేకాదు, ఈనాటి టిబెట్ ఆధీనంలో నడుస్తున్న ఈ బౌద్ధ విద్యలకు ఇంగ్లీషు అనువాదాలు మాత్రమే అందుబాటులో వున్నాయి. పాశ్చాత్య రచయితలు క్రైస్తవ దృష్టి కోణం లోంచి వాటిని ఇంగ్లీషులోకి తర్జుమా చేయడం వలన మూలసిద్ధాంతాలకు, మనం చెప్పుకొంటున్న ఈ విషయాలకూ కొంత తేడాలు వుంటే వుండవచ్చుకూడా!

అందువలన, "కాలచక్ర సాధన" గురించిన అవగాహన కోసం మాత్రమే ఈ గ్రంథంలో కొంత ప్రయత్నం చేయడం జరుగుతోందని మనవి!!

# మ్లేచ్ఛులగురించి ముందే హెచ్చరించిన కాలచక్రతంత్రం

"మ్లేచ్ఛ" పదం భారతీయులకు శత్రువులైన విదేశీయుల్ని ఉద్దేశించిన పదమే! బహుశా ఇది ఒక జాతి వారిని కాక, భారతీయత మీద దాడి చేసిన విదేశీ జాతుల వారందరినీ కలిపి పేర్కొన్న పదం కూడా కావచ్చు. బర్బరులుగా పిలువబడిన బార్బేరియన్ జాతుల వారంతా కూడా మ్లేచ్ఛులే! ఒక దశలో సంస్కృత భాష, (లేదా) వైదిక భాషతో సంబంధం లేని వాళ్ళందర్నీ మ్లేచ్ఛులుగా పిలిచినట్లు కన్పిస్తుంది.

మొదట్లో అలెగ్జాండర్ భారతదేశం మీద దండయాత్ర చేసినప్పుడు మ్లేచ్ఛ పదం వాడినట్లు కన్పిస్తుంది. క్రీస్తు పూర్వం 3వ శతాబ్ది నాటి కథ ఇది. శకులు, కుశాణులు, హూణులు... వీళ్ళంతా భారతదేశం మీద, క్రీస్తుశకం తొలి శతాబ్దాలలో దండెత్తి వచ్చిన విదేశీ మ్లేచ్ఛులు.

ఆచార్య నాగార్జునుడు క్రీ.శ. 1-2 శతాబ్దాల నాటి వాడు. ఆయన ఒక శాతవాహన చక్రవర్తికి రాసిన స్నేహపూర్వక ఉత్తరం సుహృలేఖలో కూడా మ్లేచ్ఛుల గురించి ప్రస్తావించాడు.

కాలచక్రతంత్రం మ్లేచ్ఛుల గురించి హెచ్చరించింది. భారతీయులు కాని జాతీయుల్నే మ్లేచ్ఛులుగా కాలచక్రతంత్రం పేర్కొంది.

"మ్లేచ్ఛ ధర్మాన్ని ఎవరు వ్యాప్తి చేస్తున్నారని అడిగితే, ఆదామ్, నోవా, అబ్రహామ్ అనే అసుర, నాగ కులాల గురించి చెప్పాలి. తామసులైన మరో ఐదుగురు ప్రవక్తల గురించి చెప్పాలి. మోజెస్, ముహమ్మద్ - ఎనిమిదవవాడు అంతకుడు. ఏడవవాడైన ముహమ్మద్ మళ్ళీ బాగ్దాద్ ప్రాంతం లోని నగరానికి వస్తాడు. అసుర ధర్మాన్ని ప్రచారం చేస్తాడు. ఆ నేల ఎలాంటిదంటే, అది అసుర కులస్థులతో కరుణాహీనులైన మ్లేచ్ఛులతో శక్తిమంతంగా వుంటుంది" ఇది కాలచక్రతంత్రానికి పద్మినీ వ్యాఖ్యలో వున్నట్లుగా చెప్తున్న ఒక ఇంగ్లీషు అనువాదంలోని విశేషం.

భారతీయేతర దేవతల్ని "అసురనాగ" అని ఏక శబ్దంతో పిలిచినట్లు 'కీద్రుబ్జే' అనే వ్యాఖ్యాత పేర్కొన్నాడు. భారతీయ దేవతలు, అసుర- నాగ దేవతలు అని దేవతల్ని రెండు రకాలుగా విభజించినట్లు ఈ వ్యాఖ్యానాన్ని బట్టి అర్థం అవుతోంది.

అసురనాగదేవతల అనుయాయుల వలన భవిష్యత్తులో రానున్న ప్రమాదాన్ని దృష్టిలో పెట్టుకొని శంబల దేశపు రాజు బ్రాహ్మణుల్ని, ఇతర వైదిక ప్రజల్ని హెచ్చరించి వారిని కూడా బౌద్ధులతో కలిపి అందరికీ కాలచక్ర దీక్ష ఇప్పించి వారిని మహిమాన్వితులైన బుద్ధుల్ని చేసినట్లు కాలచక్రతంత్రంలో వుంది.

భవిష్యత్తులో మక్కాలో అసురులు మహా శక్తిమంతులుగా ఎదిగి, నిర్దాక్షిణ్యంగా వ్యవహరిస్తారని కూడ కాలచక్రతంత్రంలో రాసినట్లు చెప్తారు. ఇది గమనించే బౌద్ధులు తమని శక్తిమంతులుగా చేసుకోవడానికి కాలచక్రతంత్రాన్ని వినియోగించుకున్నారు.

ఇక్కడ అసుర శబ్దమే ముఖ్యమైంది. 'నాగ' అంటే ఎనిమిది అని ఇంకో అర్థం ఉంది. భారతీయులు కాని ఎనిమిది మంది మత ప్రవక్తలు అసురులేననీ మరొక వాదన కూడా వుంది! భారతదేశంలో ఒకప్పుడు జీవించిన నాగజాతి ప్రజలకూ, ఈ నాగ శబ్దానికీ సంబంధం లేదని మరి కొందరు పరిశోధకులంటారు. భారత దేశంలో జీవించిన వారు నాగులు. వీరు బౌద్ధమత అనుకూలురు. మక్కా తదితర ప్రాంతాల్లోని వారు అసురనాగులు. వీరు బౌద్ధ వ్యతిరేకులు.

'అసురనాగ' అనే పదానికి ఎనిమిది మంది అసురులని మాత్రమే అర్థం! 'అసుర' అనే పదానికి, సంస్కృతంలో 'సుర' జాతికి చెందిన వాడనే. సురలు దేవతలు (Gods) అసురులు దేవతలకు శత్రువులు (Anti Gods). ఈ అర్థంలో బౌద్ధులు క్రీస్తుని, మహమ్మదునీ దేవతలు కారని అన్నట్లు ఒక అపోహ కలిగే ప్రమాదం ఉంది.

బౌద్ధ గ్రంథాలలో 'అసుర శబ్దం' కేవలం జాతి వాచకం. ఒక జాతి ప్రజల్ని సూచించడానికి వాడింది. కానీ, వైదిక పరంగా అది మతపరమైన పదం. వైదిక దేవతలకు విరోధుల్ని అసురులు అన్నారు. అసుర, దైత్య, దానవ రాక్షస శబ్దాలన్నీ సంస్కృత భాషలో వేర్వేరు అర్థాలు కలిగినవి అయినప్పటికీ అసురుడనే భావంలోనే ఎక్కువగా ప్రయోగించ బడ్డాయి.

వేదాలలోగాని, పురాణాలలో గానీ, ఆర్యులకు నాగులు జాతి పరమైన శత్రువులే గాని, మతపరమైన శత్రుత్వం వారితో దేవతలకు ఎంతవరకు ఉందో చెప్పలేము.

కాలచక్రతంత్రంలో కన్పించే అసుర, అసురనాగ శబ్దాలు భారతీయులైన దేవతలకు వ్యతిరేకులు అనే అర్థంలో మాత్రమే ఉపయోగించబడినట్లు అర్థం అవుతుంది. భారతీయులైన దేవతలు, భారతీయులు కాని దేవతలు అనే పద్ధతిలోనే ఈ కాలచక్రతంత్రం వర్గీకరించిందని వ్యాఖ్యాతలు చెప్తారు.

కాలచక్ర తంత్రాన్ని అర్థం చేసుకోవడానికి, అందులో చెప్పిన విషయాలను పరిశీలించడానికి కాలచక్ర తంత్ర సాధన మార్గంలోనే ప్రయత్నించాలి గానీ, హేతువాద దృష్టితో పైపై పరిశీలన చేసినందువలన మనకు తెలిసేది ఏమీ ఉండదు. ఎందుకంటే, ఈ తంత్రంలోని విషయాలు తంత్ర సాధకుల కోసం చెప్పినవి గాని మామూలు ప్రజలకు బోధించడం కోసం ఉద్దేశించినవి కావు.

ఏమైనా, ఇంగ్లీషు పండితులు, వారి వలన ప్రభావితులు వేదాలను విశ్లేషించి చేసిన వ్యాఖ్యానాలనే మనం ఎక్కువగా చదువుకొని నమ్ముతున్నాం. అసుర, నాగ, యక్ష, కిన్నెర, కింపురషాది జాతుల గురించి మనం మరింత లోతుగా అధ్యయనం చెయ్యడం కోసం, టిబెట్‌లోనూ, చైనాలోనూ వున్న బౌద్ధ గ్రంథాల్లోంచి సమాచారాన్ని వెలికి తెచ్చి అధ్యయనం చేయాల్సిన అవసరం ఉంది.

మేడమ్ హెచ్.పి. బ్లావట్స్కీ టిబెట్‌లో బౌద్ధ మతానుయాయుల ద్వారా బ్రహ్మాండ సృష్టి విజ్ఞానం గురించిన చాలా విశేషాలు "ది సీక్రెట్ డాక్ట్రయిన్" గ్రంథంలో పొందు పరిచారు. ఆమెకు కాలచక్రతంత్ర గ్రంథాలతో ఎంత వరకూ పరిచయం వున్నదో తెలియదు. అయితే, అక్కడక్కడ కన్పించే కాలచక్రతంత్ర విషయాలు పరిశీలించినప్పుడు బ్లావట్స్కీ రాసిన విషయాలతో పోల్చి చూడడం అవసరం అనిపిస్తుంది.

ది సీక్రెట్ డాక్ట్రయిన్‌లో ఒక సందర్భంలో పితృదేవతల్ని మనిషి తనను చలి నుంచి రక్షించు కోవడం కోసం నివాసాల్ని, వస్త్రాల్ని కోరుతూ ప్రార్థించిన కథ వుంది. నిర్మనస్కాయులైన నాగులు- తెలివైన సర్పాలు- కాంతి రూపంలో ప్రత్యక్ష మయ్యారట... వారితో పాటే పురోగాములైన జ్ఞాన బుద్ధుల్ని కూడా పితృ దేవతలు ప్రసాదించారట.

దేవతలు స్వయంగా దిగివచ్చి మనుషులకు విజ్ఞాన శాస్త్రాన్ని, కళల్ని బోధించినట్లు సీక్రెట్ డాక్ట్రయిన్‌లో వుంది.

నాగులు నాగరకతని తెచ్చిన తొలి జాతిగా ఈ వర్ణన బట్టి మనకి అర్థం అవుతుంది. అసుర నాగులు, భారతీయులైన నాగులు వేర్వేరని, అసురనాగులు దేవతలకు వ్యతిరేకులనీ భారతీయ నాగులు నాగరకతను వ్యాప్తించేశారని ఊహించవచ్చు. కొన్ని బుద్ధ విగ్రహాల వెనక ఐదు తలల నాగు పడగ పట్టి వుంటుంది! నాగులు బౌద్ధాన్ని అనుసరించిన వారనడానికి ఇది సాక్ష్యం కూడా! వారు తెలుగువారే కావచ్చుని కూడా అర్థం చేసుకోవచ్చు.

# టిబెట్ తో తెలుగు వారి సంబంధాలు



టిబెట్ అంటే, త్రివిష్ఠప దేశంగా మన గ్రంథాల్లో కన్పిస్తుంది. లాసా నగరంలో దాపాంగ్ అనే చోట అమరావతి బౌద్ధ స్తూపం నమూనాతో క్రీస్తు శకం తొలి శతాబ్దాలలో, ఒక బౌద్ధ స్తూపాన్ని నిర్మించారు. అమరావతిలో బౌద్ధులు ఆ రోజుల్లో ఈ స్తూపాన్ని ఎలా నిర్వహించేవారో, సరిగా అదే మార్గంలో, అదే పద్ధతుల్లో, అదే విధానాలతో దాపాంగ్‌లో కూడా నిర్వహిస్తున్నట్లు రాసుకున్న రికార్డులు టిబెట్‌లో దొరికాయి. అమరావతి బౌద్ధ స్తూపం వున్న ప్రాంతాన్ని "ధాన్య కటకం" అని పిలిచేవారు. టిబెట్ బౌద్ధ స్తూపం వున్న నగరం దాపాంగ్‌కి టిబెట్ భాషలో "ధాన్యరాశి" అని అర్థం. అంటే, ధాన్యకటక బౌద్ధ క్షేత్రాన్ని పేరుతో సహా అనుకరించి టిబెట్‌లో బౌద్ధ స్తూపాన్ని నిర్వహించినట్లు ఈ రికార్డులు చెప్తున్నాయి.

బుద్ధుడు ధాన్యకటకానికి వచ్చిన సంగతి కూడా ఈ టిబెట్ గ్రంథాల ఆధారం గానే మనకు తెలుస్తోంది. సింహళ దేశపు రికార్డుల్లో కూడా తెలుగువారితో బుద్ధుడికి గల సంబంధాల గురించి చాలా వివరాలు ఉన్నాయంటారు.

వాటిని వెలికి తేవాలి! ఎవరు తెస్తారు? ప్రభుత్వాలకు పట్టదు. ప్రజలు మర్నాడే మర్చిపోయే స్వభావం కలిగి వుంటారు. అందుకే ఇన్నేళ్ళయినా మనకు మన గురించి ఏమీ తెలియకుండా పోతోంది.

నాగులకూ బుద్ధుడికీ వున్న సంబంధాల గురించి, నాగులకూ తెలుగు వారికీ వున్న సంబంధాల గురించి, ఆనాటి తెలుగు భాష స్వరూపం గురించి, తెలుగు ప్రముఖుల గురించి అధ్యయనం చెయ్యడానికి కాలచక్రతంత్రం ఒక సజీవ సాక్ష్యం.

తెలుగు నేల మీద జరుగుతున్న ఈ 30వ కాలచక్రతంత్ర ప్రావేశిక మహోత్సవం చాలా విశిష్టమైంది. ఇది తెలుగు వారందరమూ గర్వించదగిన సమయం.

ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని ఉత్సాహవంతులైన తెలుగు వారు ఎవరైనా కాలచక్ర తంత్ర దీక్ష తీసుకొని తెలుగు వారి చరిత్రను పరిశోధించ గలిగితే వారి జన్మ ధన్యమైనట్లే !!

# కులభేదాలు లేని వ్యవస్థ కాలచక్రం

కాలచక్రం మూడు అంచెలలో ఉంటుందని చెప్పుకున్నాం.

1. బయటి అంచె : ఇది, చరిత్రతో పాటు నడిచిన కాలాన్ని, గ్రహాలతో పాటు నడుస్తున్న కాలాన్ని వివరిస్తుంది.

2. లోపలి అంచె : మానవ శరీరం, దాని ఆరోగ్యం, మంచి చెడులు గురించి ఈ అంకెలో వివరిస్తారు.

3. ప్రత్యామ్నాయ అంచె : ఈ రెండింటికి బదులుగా మూడో అంచె కూడా చెప్పారు. అది తంత్ర సాధన, బౌద్ధ ధర్మాల్ని పాటించడం, బౌద్ధ తరహాలో జీవించడం దీనిలో ముఖ్య విషయాలు.

త్వరలో తన రాజ్యంపై మ్లేచ్ఛుల దాడి జరగబోతోందని తెలిసి వారి అంగీకారంతో శంబల రాజు మంజుశ్రీ కల్కి అవతారంగా వచ్చి, శంబలలోని ప్రజలకు బ్రాహ్మణులు విదేశీయులతో సహా అందరికీ వారి అంగీకారంతో కాలచక్రతంత్ర దీక్షని ఇచ్చాడు. తద్వారా శంబల లోని ప్రజలంతా ఒకే బౌద్ధ రామానికి చెందిన వారిగా మారారు. ఏ కులానికి చెందిన వాడైనా, ఏ దేశానికి చెందిన వాడయినా, ఆ ఆరామానికి చెందిన వాడు గానే వుంటాడు.

ఇంక, తమ కులాన్ని, తమ దేశాన్ని, తమ జాతీయతని వాళ్ళు పూర్తిగా మరిచిపోతారు. వీరంతా ఒకే కులం. ఆ కులం పేరు "వజ్రకులం" మనుషులంతా వజ్రసోదరులు, వజ్రసోదరీలు అవుతారు.

బ్రాహ్మణులు గానీ, ఇతర కులాలకు చెందినవారు గానీ కాలచక్రతంత్ర అభ్యాసకులు గానూ సాధకులుగానూ మారితే, వారు అప్పటి నించీ తమ స్వంత కుల భేదాల్ని, దేశ భేదాల్ని వదులుకొని- సంఘ సభ్యులుగా, బౌద్ధ సాంఘికులుగా వ్యవహరించబడతారు.

టిబెటన్ భాషలో సంఘాన్ని "డ్జి-దున్" అంటారు. "నిర్మాణాత్మక ఆలోచనలు చేసే వ్యక్తుల కూటమి" అని దీని అర్థం. కులాల ప్రస్తావన లేకుండా జరిగే చర్చలు నిర్మాణాత్మకంగానే వుంటాయి కదా!

ఇలా నిర్మాణాత్మకంగా (CONSTRUCTIVE) వ్యవహరించడం అనేది ఆధ్యాత్మిక పరమైన పథ నిర్దేశం (SPIRITUAL AGENDA) మాత్రమే గాని, ఇందులో రాజకీయ, సైనిక నియంత్రృత్వాల పరమైన అంశాలేమీ లేవు.

కాలచక్ర మండలంలో కలిసి పోదాం రండీ- అని పిలుస్తోంది వ్యక్తులందరినీ కాలచక్రతంత్రం!

# భువనయంత్రం

అనేక ప్రయోజనాల కోసం అనేక రకాలుగా `ఇసుకమండల చిత్రాల్ని యోగసాధకులు చిత్రిస్తూ వుంటారు.

భువన మండల చిత్రం (COSMIC MANDALA) ఈ అనంత విశ్వ నిర్మాణానికి సంబంధించిన పరిజ్ఞానాన్ని అర్థం చేసుకోవడానికి ఉపయోగపడ్తుంది. కాలచక్రతంత్ర సాధకులకు మాత్రమే ఉపయోగపడే అంశం ఇది అని వేరే మనం చెప్పుకోనవసరం లేదు కదా!



ఈ మండల చిత్రాలన్ని ధ్యాన్న ప్రక్రియకు ఉపయోగపడేవి.

బుద్ధుడి శక్తి విశ్వం నలుమూలలా విస్తరించి ఆ స్వస్థత శక్తి (Healing Power of Budha) ద్వారా మానవాళికి ఉపశమనం కలిగించేందుకు భువన మండల చిత్రం దోహదపడ్తుంది.

స్వస్థత చేకూర్చే శక్తి కలవాడు కాబట్టే బుద్ధుని "మెడిసిన్ బుద్ధ" అని పిలుస్తుంటారు.

ఈ మండల చిత్రాల్ని యోగిక భాషలో యంత్రంటారు. కాలచక్ర తంత్రం పరిభాషలో సంస్కృత పదాలు వున్నాయి గానీ, యోగిక పరమైన పారిభాషక పదాలు చాలా తక్కువ! యంత్రాన్ని మండలం గానే కాలచక్రతంత్రం వ్యవహరిస్తుంది. మన పరిభాషలో కాస్మిక్ మండలాన్ని "భువన యంత్రం" అని పిలవ వచ్చున్నమాట.

భువన యంత్రాన్ని ప్రతిష్ఠించి, కాలపురుషుణ్ణి ఆవాహన చేస్తారు.

ఈ యంత్రాలు ఇలాంటివి అనేకం వున్నాయిట! ప్రారంభదశలో ఉన్న సాధకుల కోసం, మామూలు మనుషుల కోసం, మహా సాధకుల కోసం కూడా కాలచక్ర తంత్ర యంత్రాలు వేర్వేరుగా వుంటాయి.

అయితే, ఇవి దేవుడి గదిలో ప్రతిష్ఠించి పూజ చేసుకోవడానికి ఉద్దేశించినవి కావు- ఈ యంత్రాల సహాయంతో ధ్యాన్న శక్తిని పెంచుకోవడానికి వీటిని వినియోగించుకోగలగాలి.

భువన యంత్రంలో జ్వాలా మయంగా వున్న బైటి వలయాలు మధ్యలో మూడు పాదాలుగా వున్న చిన్న చక్రాలు కన్పిస్తున్నాయి. పృధ్వి, జలమూ, అగ్ని, వాయువూ, ఆకాశం- పంచమహాభూతాలన్ని ఈ యంత్రంలో వివిధ రంగుల్లో చిత్రించబడి వున్నాయి. బైట చక్రంలో 12 వలయాలున్నాయి. సూర్యచంద్రులు, నక్షత్రాలు, ఋతువులు, మాసాలకు ఇవి గుర్తులు.

ఇలాంటి యంత్రాలను ప్రతిష్ఠించేప్పుడు టిబెట్ బౌద్ధులు సాధారణంగా పెద్దపెద్ద ఉత్సవాలనే నిర్వహిస్తారు. ఉత్సవం తర్వాత యంత్రం పై ఆవాహన చేయబడిన దేవతలకు ఉద్వాసన పలికి, రంగులు చిత్రించిన ఇసుకని పవిత్రంగా తీసుకు వెళ్ళి జల నిమజ్జనం చేస్తారు.

నిజానికి కాలచక్రతంత్రం లోని ఈ ప్రక్రియలన్నింటినీ రహస్యంగానే చెయ్యాల్సి వుంది. మండల చిత్రాలు కూడా సాధకులకు మాత్రమే తెల్సినవిగా వుండేవి.

ఇలా రహస్యంగా వుంచినందువలన బైట ప్రపంచానికి టిబెట్ బౌద్ధ విధానాల పట్ల, కాలచక్రతంత్రం పట్ల అనేక అపోహలు, అనుమానాలు ఏర్పడుతుండడంతో పూజ్యశ్రీ దలైలామా దీక్ష ప్రదానం చెయ్యడం అత్యధిక సంఖ్యాకులైన ప్రజల సమక్షంలో ప్రారంభించారు. ఆ విధంగా కాలచక్రతంత్ర సాధకులకు దీక్ష నివ్వడం, వారిని ఈ తంత్ర విద్యలో అక్షరాభ్యాసం చేయించి ప్రవేశ పెట్టడం అనేవి ఒక ఉత్సవంగా మారాయి.

1957 నుంచి ఇప్పటి వరకూ 30సార్లు ఈ ఉత్సవాలు ప్రపంచవ్యాప్తంగా జరిగాయి.

ఇప్పుడిది కేవలం టిబెట్ బౌద్ధానికే పరిమితమైన ఉత్సవం కాదు- ఇది అంతర్జాతీయ ఉత్సవం!!

# హృదయ పరివర్తన కాలచక్రం లక్ష్యం

ప్రకాశవంతమైన మనోవికాసాన్నీ, బుద్ధి వికాసాన్నీ పొందేందుకు బౌద్ధ తాంత్రిక విధానం "కాలచక్ర" ఉపయోగిస్తుందని బౌద్ధుల విశ్వాసం. తద్వారా సమస్త మానవాళికి మేలు కల్గించడం దీని లక్ష్యం.



ఈ అనంత విశ్వాన్ని శాసిస్తోన్న కాలాన్ని రోదసిలోనే కాదు- సమస్త ప్రాణుల ఉచ్ఛ్వాస నిశ్వాసాల్ని, శరీరం లోపలి సూక్ష్మ శక్తుల్ని కూడా కాలచక్రతంత్రం మనోవికాసం కోసం వినియోగిస్తుందన్నమాట.

శూన్యంలో సంచరించే దైవిక, ఆత్మిక శక్తుల్ని ధ్యాన పద్ధతుల ద్వారా, యోగ పద్ధతుల ద్వారా మాత్రమే కాక, తాంత్రిక పద్ధతుల ద్వారా కూడా ఇందుకు ఉపయోగించడం ఈ కాలచక్ర విధానం.

శరీరానికి బైటి ప్రపంచం గానీండి, శరీరం లోపలి ప్రపంచం గానీండీ, "కర్మ"వలనే ఏర్పడుతున్నాయి. కాలచక్ర తాంత్రిక విధానం ఈ కర్మని "శుద్ధి" చేస్తుంది (PURIFIES THE KARMA). కర్మ పరిశుద్ధత వలన సాధకుడు సర్వ ప్రాపంచిక విషయాల్లోంచీ విముక్తుడు కాగలుగుతాడు.

వ్యక్తుల వ్యక్తిగత శక్తులు విడివిడిగా గాని, సమూహంగా గానీ ఏర్పడే శక్తి ప్రవృత్తుల్ని (Energy Impulses) కర్మ వాయువులంటారు. (Winds of Karma)

ఇవి రెండు రకాలుగా వుంటాయి. కాలచక్రంలో వెలుపలి వలయాలు లోపలి వలయాలుగా వీటిని చెప్తారు. లోపలి, బయటి వలయాల ప్రభావాన్నే "సంసారం" అంటున్నాం.

కాలానికి సంబంధించి ఈ వలయాల్లో 3 ప్రధాన విషయాలున్నాయి.

1) గ్రహాలు (ASTROLOGICAL) వగైరా అంతరిక్ష విషయాలు

2) నెలలు వారాలు, గంటలు వగైరా నిత్య వ్యవహార పంచాంగ (CALENDRICAL) విషయాలు.

3) ఊపిరి పీల్చుకోవడం వదలడం, నాడి కొట్టుకోవడం కనురెప్పలు కొట్టుకోవడం వగైరా... జీవనీయ విషయాలు (BIOLOGICAL)

వీటన్నింటి సమాహారమే ఈ సంసారం. ఈ సమస్త ప్రపంచం. వీటిని సద్వినియోగం చేసుకొంటూ వ్యక్తి తన సమర్థతని పెంచుకొని, తాను మరింత శక్తిమంతుడై, ఇతరులకు ఉపయోగపడే విధంగా ఎదగాలి... అంటుంది కాలచక్ర తంత్ర శాస్త్రం.

కాలచక్ర తంత్ర శాస్త్రంలోంచే, టిబెట్ జ్యోతిష్య శాస్త్రం, ఖగోళశాస్త్రం, వైద్యశాస్త్రం పుట్టాయి. వివిధ రత్నాలు, వజ్రాలు, పగడాలతో చేసిన ఔషధాల గురించి టిబెట్ వైద్యశాస్త్రంలో ఎన్నో విశేషాలున్నాయి. మంగోలియా, చైనాలలో కూడా కాలచక్ర తంత్రం ఆధారంగా అనేక ప్రాచీన విద్యల్ని అభివృద్ధి పరుచుకున్నారు.

ఇతర తాంత్రిక విద్యలు గురువు శిష్యుడికి బోధించే పద్ధతిలో వుంటాయి. అవికూడా పరిమితంగా కొద్దిమంది వ్యక్తులకు మాత్రమే అందించేవిగా వుంటాయి. కానీ, కాలచక్రతంత్రం సామూహికంగా ఒకేసారి అనేకమందికి బోధించే విధానంలో వుంటుంది.

బుద్ధుడు అమరావతిలోని ధాన్యకటకంలో శంబలరాజు సుచంద్రుడి కోరికమీద ఒక పెద్ద సభని జరిపి బౌద్ధ భిక్షువులనేకమందికి కాలచక్రతంత్రాన్ని బోధించాడు.

అలాగే కొన్ని శతాబ్దాల తర్వాత శంబల దేశపు ఇంకొక రాజు తన రాజ్యంలోని ప్రజలందరికీ ఒకేసారి కాలచక్ర దీక్షనిచ్చి అందరినీ బౌద్ధులుగా సమైక్యపరిచాడు. తద్వారా రాజ్యంలో శాంతిని సాధించాడు. బౌద్ధంలో కులవివక్షలు, వర్గ వివక్షలూ లేకపోవడాన సర్వమానవ సమానత్వం సాధించగలిగాడు ఆయన!

ఈవిధంగా ప్రపంచ శాంతికి దోహదపడడమే లక్ష్యంగా ఎప్పటికప్పుడు కాలచక్రతంత్ర దీక్షాప్రదాన ఉత్సవాలు ప్రపంచం నలుమూలలా జరుపుతూ, దేశవిదేశాల్లోని వివిధ ప్రజల్ని ఈ మార్గం వైపు ఆకర్షిస్తున్నారు దలైలామా!

భారతదేశంలో ఏది జరిగినా అది పాశ్చాత్య దేశాల కుట్రగా అభివర్ణించడం మామూలు విషయమే! హిందూ మతాన్ని దెబ్బకొట్టటడం కోసం దలైలామాని

ప్రోత్సహిస్తున్నారనీ, అమరావతిలో జరిగేది ఈ కుట్రలో భాగమేనని వీణ నొక్కులు నొక్కుతున్న వారు లేకపోలేదు.

1) హిందూ మతం అనేది ప్రత్యేకంగా వున్నదా? వుంటే, బౌద్ధం అందులో ఒక భాగం కాకుండా వేరే మతం ఎలా అవుతుంది?

2) శైవాన్ని వైష్ణవమూ, వైష్ణవాన్ని శైవమూ అంగీకరించని హిందూమతంలో, శైవవైష్ణవాలు అంగీకరించకపోయినంత మాత్రాన ఈ దేశంలో పుట్టి, ఈ నేల మీద పెరిగిన బౌద్ధం మనది కాకుండా పోతుందా?

3) బౌద్ధం అభివృద్ధి చెందితే హిందూమతానికి ఏ విధమైన అపకారం జరుగు తుంది? నిజానికి హిందూ సమాజానికి చాలా మేలు కలుగుతుంది. కులాలు లేని వ్యవస్థ గురించి ఆలోచించే అవకాశం మరొకసారి మనకు ఏర్పడుతుంది కాబట్టి!

ఇక్కడ లక్ష్యం వ్యక్తుల్ని బుద్ధుల్ని చేయడమే గానీ బౌద్ధుల్ని చేయడం ఎంతమాత్రమూ కాదని అర్థం చేసుకోవాలి.

కాలచక్రదీక్ష వ్యక్తి హృదయంలోనూ, మనసులో కూడా తాను బుద్ధుడిని కావాలనే కోరికని బలంగా రగిలిస్తుంది. ఈ "బుద్ధిమత"ని లేదా బుద్ధత్వాన్ని పొందడానికి అడ్డుపడే మానసిక అవరోధాల్ని అధిగమించి, వాటిని శుద్ధి చేసుకొంటూ, దృఢ నిశ్చయంతో, నిశ్చలమైన మనసుతో, స్థిరచిత్తంతో, పట్టుదలగా కృషిచేస్తే కాలచక్ర తంత్రం ప్రతివ్యక్తినీ బుద్ధుడంతటి వాణ్ణి చేసి తీరుతుందని బౌద్ధ పండితులంటారు.

ఈ కాలచక్రతంత్రాన్ని సాధించడం కోసం అందులోకి ప్రవేశించడానికి గురువు అనుమతిని పొందిన క్షణం నుంచి ఆ వ్యక్తి ఆలోచనా విధానంలోనూ, ప్రవర్తనలోనూ మౌలికమైన మార్పు స్పష్టంగా గోచరించాలి!

అందుకనే దీక్షని ఇవ్వబోయేముందే గురువు ఆ వ్యక్తికి ఎన్నో రకాల బోధలు చేసి, మనసు మరల్చి, సంస్కరించి సానబట్టిన వజ్రంలా తయారుచేసి అప్పుడు కాలచక్ర తంత్రంలోకి ప్రవేశపెడతారు. అలా మనసును శుద్ధి చేయడాన్ని "లామ్‌రిమ్" అంటారు టిబెట్ భాషలో!

కాలచక్ర దీక్షని పొందబోయేముందే వజ్ర గురువు ఉన్నత వ్యక్తిత్వం గురించి వారికి బోధిస్తారు.

# కాలచక్రం ఇలా వుంటుంది...!

కాలాన్ని కొలుస్తాం. మన కళ్ళముందు కనిపించే అంశాల్ని సంవత్సరాలు, నెలలు, గంటలు, నిమిషాలు, సెకన్లలో కొలుస్తాం. అంతరిక్షంలో కదిలే గ్రహాలు మన కళ్ళకు పైకి కన్పించకపోయినా వాటి గమనాన్ని బట్టి కూడా కాలాన్ని కొలుస్తున్నాం. ఇదంతా కాలచక్రంలో బయటి చక్రానికి సంబంధించిన విషయం. external cycle అంటారు దీన్ని.



ఇవి మాత్రమే కాదు. మన శరీరం లోపల కూడా కాలచక్రాలున్నాయి. వాటినీ కొలవగలగాలి అంటుంది కాలచక్రం. శరీరం లోపల సంచరించే శక్తి, ఊపిరి... ఇవే కదా ఈ సృష్టిని నడిపిస్తోన్నాయా? ప్రాణికోటి లేకపోతే ఈ సృష్టికి అర్ధమే లేదు కదా... కాబట్టి ప్రాణికోటికి ప్రాణప్రదమైన అంశాలు లోపలి చక్రంగా పిలువబడ్డాయి. ఇది Internal Cycle. ఈ లోపలి చక్రంలోని విషయాలు కూడా బయట చక్రంలోని గ్రహగతులు వగైరాలకు ముడిపడే నడుస్తాయని కాలచక్రతంత్రం పేర్కొంటోంది.

పైరెండూ కాకుండా మూడో కాలచక్రం కూడా చెప్పబడింది. ఇది ప్రత్యామ్నాయ కాలచక్రం. ALTERNATIVE CYCLE. ఇందులో వివిధ ధ్యాన్న మార్గాలు, కాలచక్రం

బోధించిన యోగ పద్ధతులు వుంటాయి. ఈ ధ్యాన్న విధానాల్ని- మొదటి రెండు చక్రాల్లోని విషయాల శుద్ధి కోసం ఉద్దేశించినవంటుంది ఈ కాలచక్రతంత్రం. అంటే, అటు గ్రహగతుల్ని ఇటు ప్రాణికోటిని కూడా శుద్ధి చెయ్యడానికి మూడవ కాలచక్రంలో ధ్యాన్న విధానాలను (MEDITATION PRACTICE) చెప్పడం జరిగింది.

స్థూలంగా కాలచక్రతంత్రం ఈవిధంగా మూడు ముఖ్య భాగాలుగా వుందని మొదట మనం అర్థం చేసుకోవాలి. బాహ్య కాలచక్రంలోని గ్రహాదులు, లోపలి కాలచక్రంలోని జీవరాసి ఇవన్నీ, అవి విడివిడిగా గానీ, అన్నీ కలిసి గానీ ప్రసరించే శక్తి Impulses of energy మీద ఆధారపడివుంటాయి. ఈ శక్తి ప్రసరణల్ని కర్మ వాయువులంటుంది కాలచక్రతంత్రం.

మన మానసిక స్థితి సూక్ష్మ శక్తులతో నిండి వుంటుంది. విశ్వాంతరాళ కాలచక్రం లోంచి (Astrological Cycle) ప్రసరించే సూక్ష్మ శక్తులు, అంతశ్చైతన్య కాలచక్రం (Biological Cycles) లోంచి ప్రసరించే సూక్ష్మశక్తులు మానవుల మానసిక స్థితిని ప్రభావితం చేస్తున్నాయనేది ఇక్కడ ముఖ్య విషయం!

ఈ సూక్ష్మ శక్తుల్ని సద్వినియోగం చేసుకోవడం ద్వారా కాలచక్ర సాధకుడు తాను అభివృద్ధిని పొంది, ఆ అభివృద్ధిని ఇతరులకు పంచగలుగుతాడు- అంటుంది కాలచక్రతంత్రం.

అంటే అర్థం అయ్యింది కదా... గ్రహాదులు అందించే శక్తినీ, శరీరం లోపల సంచరించే జీవశక్తినీ సమన్వయపరచి మనం మన మానసిక స్థితిని అభివృద్ధి చేసుకొని, తద్వారా లోకం అభివృద్ధి సాధించేందుకు తోడ్పడటానికి బాగా ఉపయోగపడుతుందీ ఈ కాలచక్రతంత్రం... అని!

ఇంకో విధంగా వివరించాలంటే, ఖగోళశాస్త్రం (యాస్ట్రానమీ), జ్యోతిషవిజ్ఞానం (యాస్ట్రాలజీ), టిబెట్ వైద్యశాస్త్రం, రత్నాలు, వజ్రాల వంటి వాటి ప్రభావాలను అధ్యయనం చేసే అంశాలన్నీ ఈ కాలచక్రతంత్రంలో వుంటాయి. వాటి ప్రభావం మన మీద ఇతోధికంగా ప్రసరింప చేసుకొని శారీరక, మానసిక శక్తుల్ని పెంపొందింప చేసుకోవడం ఈ కాలచక్ర తంత్ర లక్ష్యం అని మనకు అర్థం అవుతోంది.

కాలాన్ని శక్తిగా వినియోగించుకోవడానికి కాలచక్రతంత్రం ఉపయోగ పడ్తుందన్న మాట.

# తెలుగు నేలపై దీక్ష గర్వకారణం

అభ్యాసం, సాధనల వలన మాత్రమే కాలచక్ర తంత్రం సాధ్యం అవుతుంది. 'సాధన'ని సమర్థుడైన గురువు ఇవ్వగలుగుతాడు. 30వ కాలచక్రతంత్ర దీక్షా ప్రదానం తెలుగు నేలపైన ఈసారి జరగడం మనకు గర్వకారణం. దీక్షను స్వయంగా బౌద్ధ మతాధిపతి దలైలామానే ఇస్తారు.

దీక్షా కార్యక్రమం 12 రోజుల పాటు సాగుతుంది. సాధకుల్ని దీక్ష అక్షరాభ్యాసం చేయించడంతో మొదలై సాధన వలన సమకూరిన అనుకూల శక్తి (పాజిటివ్ ఎనర్జీ)ని ప్రపంచ మానవుల సంక్షేమం కోసం, ప్రపంచ శక్తి కోసం లోకంలోకి విడుదల చేయడంతో ఈ కాలచక్ర దీక్ష కార్యక్రమం ముగుస్తుంది.



లోకాన్ని శక్తి సంపన్నం చేయడం ఈ కార్యక్రమం పరమ లక్ష్యం. కాబట్టి దీన్ని 'కాలచక్ర ఎంపవర్‌మెంట్' కార్యక్రమం అంటున్నారు.

దీక్షనిచ్చే గురువుని 'వజ్రగురువు' అంటారు. వజ్రం లాంటి దృఢచిత్తానికి ఈ కాలచక్ర సాధన ఒక సంకేతం కాబట్టి వజ్రగురువు అన్నారు.

వజ్రగురువు కాలచక్రతంత్ర సాధన ద్వారా తాను సాధించిన మానవ శక్తిని లోకోద్ధరణకు వినియోగిస్తానని మొదటగా వాగ్దానం చేస్తాడు. అలా వాగ్దానం చేసిన తర్వాతే కాలచక్రం శక్తి వజ్రగురువు ద్వారా నూతన సాధకులకు, సాధకుల నుంచి సమాజంలోని మనందరికీ చేరుతుంది.

కాలచక్ర దీక్షా కార్యక్రమం జరిగే స్థలాన్ని టిబెట్ భాషలో 'థెక్ పూ' అంటారు. ఉన్నత ఆసనం మీద వజ్రగురువు దలైలామా ఆసీనులౌతారు. దీక్షా కార్యక్రమాన్ని ఇక్కడ నిర్వహించడానికి పంచ మహాభూతాల అనుమతిని కోరతారు. 720 ప్రకృతి శక్తులైన దేవతల్ని ఆవాహన చేస్తారు. కాలచక్ర పురుషుణ్ణి ప్రతిష్టిస్తారు.

దలైలామా స్వయంగా కాలచక్ర మండల చిత్రాన్ని చిత్రిస్తారు. సాధకులు ఆ గీతల మధ్య రంగురంగుల ఇసుకను శాస్త్ర ప్రకారం నింపుతూ కాలచక్రతంత్ర ఇసుక మండలాన్ని చిత్రిస్తారు. ఒక్కోరంగుకూ, ఒక్కో గీతకి ఒక్కో పరమార్థం వుంది. 722 మంది దేవతల్ని ఈ చిత్రంలో వారివారి స్థానాలలో ప్రతిష్టాపన చేస్తారు. ఇదంతా వజ్రగురువు అనుమతితోనే జరుగుతుంది. ఈ అనుమతిని 'హోంగ్ ఖోర్' అంటారు.



# కాలచక్ర తంత్ర నిర్మాణం

బుద్ధుడు కాలచక్ర తంత్రాన్ని బోధించిన రెండున్నర సహస్రాబ్దాలు గడిచిన తర్వాత, కాలచక్ర బోధనా విధానంలో రెండు పద్ధతులు ఏర్పడ్డాయి. టిబెట్ బాషలో వీటిని రా-లుగ్స్‌మార్గం అనీ, 'డ్రో-లుగ్స్' మార్గం అనీ అంటారు.

రా, డ్రో అనే మార్గాలు సంస్కృతంలోంచి కాలచక్రతంత్రాన్ని టిబెట్ భాషలోకి అనువదించినప్పుడు, ఆయా అనువాదకులు అనుసరించిన విధానాన్ని బట్టి ఏర్పడిన మార్గాలే! రెండింటి మధ్య స్వల్ప వ్యత్యాసాలే గానీ, మౌలికమైన తేడాలు వుండవు. మేధావులు అనుసరించే మార్గం కాబట్టి ఒక పదానికి అనేక విధాల అర్థాలుంటాయి కాబట్టి ఇలాంటి భిన్నత్వం సహజంగా వుంటుంది.

క్రీ.శ. 966లో కాలచక్రతంత్రాన్ని టిబెట్ నుంచి ఒక పండితుడు తిరిగి భారతదేశానికి తీసుకువచ్చి ఇక్కడే ప్రచారంలో పెట్టాడు. ఆ పండితుణ్ణి 'రా-లుగ్స్' మార్గంలో చిలూప పండితుడంటారు. 'డ్రో-లుగ్స్' మార్గంలో "కాలచక్ర పదుడు" అంటారు.

'హెల్ముట్ హోఫ్‌మన్' అనే జర్మన్ పండితుడు భారతదేశంలో బౌద్ధమత చరిత్రకు సంబంధించిన విశేష పరిశోధనలు చేశాడు. బుద్ధుడు అమరావతికి వచ్చాడనే పరిశోధన ఆయన చేసినదే!

ఆయనే భారతదేశంలో వ్యాప్తిలో వున్న కాలచక్రతంత్రాలు టిబెట్‌లో వ్యాప్తిలో వున్న 'రా' 'డ్రో' ఆచారాలకు సంస్కృత రూపాలని తేల్చి చెప్పాడు. "చిలూపా", "కాలచక్ర పద"- ఇవి ఒకే వ్యక్తికి చెందిన రెండు పేర్లుగా ఆయన ప్రకటించాడు.

తెలుగువారికి చార్లెస్ ఫిలిప్ బ్రౌన్, కొలనెల్ మెకంజీ, రాబర్ట్ స్యూయల్, కాటన్ దొర వంటి విదేశీయులుతో పాటు హెల్ముట్ హోఫ్‌మన్ చేసిన కృషి కూడా గొప్పది! వీరంతా మనకి ప్రాతఃస్మరణీయులు. ప్రొద్దున్నే నిద్రలేస్తూనే స్మరించుకోదగిన పుణ్యాత్ములు.

మొదటి కల్కి శంబాలరాజుమంజుశ్రీ కీర్తి స్వయంగా ఈ చిలూప పండితుడికి కాలచక్ర అక్షారాభ్యాసం చేసి, కాలచక్రతంత్రాన్ని బోధించి పంపించాడని అంటారు.

ఈ కథ ఇక్కడితో ఆగలేదు.

ఈ చిలూప (లేదా) కాలచక్రపదుడు నలందా విశ్వవిద్యాలయంలో జరిగిన పండిత సభలో వివాదం ఏర్పడినప్పుడు బౌద్ధ పండితుల్ని ఓడించి గెలుపొందడం జరిగింది. నలందాలో అప్పుడు బౌద్ధ మతాధిపతిగా నడపదుడనే ఆయన వున్నారు.



చిలూప పండితుడు నడపదుడికి కాలచక్ర చరిత్ర అక్షరాభ్యాసం చేశాడు. ఈ ఇద్దరూ కలిసి కాలచక్రతంత్రాన్ని భారతదేశం లోనూ, టిబెట్‌లో కూడా వ్యాప్తి చేశారు.

నడపదుడు నలందా విశ్వవిద్యా లయానికి చెందిన చాలామంది ఆచార్యు లకు కాలచక్ర దీక్షాప్రదానం (INITIATION OF KALA CHAKRA) చేశాడు. వారిలో అతిషుడు, పిండో ఆచార్యుడు ఈ ఇద్దరూ కాలచక్ర తంత్రానికి తర్వాతి కాలంలో ఎక్కువ ప్రచారం తీసుకు వచ్చారు.

పండిత సోమనాధుడనే కాశ్మీరీ పండితుడు క్రీ.శ.1027లో ఈ కాలచక్ర తంత్రాన్ని తిరిగి టిబెట్‌కు తీసుకువెళ్ళాడు. అక్కడ ఆయన సంస్కృత భాషలో చెప్పిన ఈ తంత్రాన్ని "డ్రోటన్ షెరాబ్ డ్రాక్ లోట్సా" అనే ఆయన టిబెట్ భాషలోకి అనువదించాడు. "డ్రోటన్" గారి వలన ఆ గ్రంథాన్ని అనుసరించే వారిని "డ్రో" మార్గీయులు అంటారు. శమంతశ్రీ అనే పండితుడు టిబెట్‌కు తీసుకువచ్చిన కాలచక్ర తంత్రాన్ని రాషోరాబ్ లోత్సా అనువదించాడు. ఈ గ్రంథాన్ని అనుసరించే వారు "రా" మార్గీయులయ్యారు.

రా, డ్రో పదాలకు ఇంతకన్నా ప్రత్యేకమైన అర్థం ఏమీలేదని పండితులు తేల్చి చెప్పారు.

భారతదేశంపైన ముస్లిం దాడులు ముమ్మరం కావడం వలన భారతీయ సంస్కృతిలోని మౌలిక అంశాలు ఒక్కసారిగా దెబ్బతిన్నాయి. ఆయుర్వేద శాస్త్రము, రసశాస్త్రము, ఖగోళ జ్యోతిష శాస్త్రాలూ నూతన పరిశోధనలు చేసే అవకాశాలు కోల్పోయి, ముస్లింలు ధ్వంసం చేయగా మిగిలిన గ్రంథాల్ని సంరక్షించుకోవడం కష్టమైన అంశంగా మారింది. అప్పటిదాకా కొనవూపిరితో వున్న జైనమతం, బౌద్ధ మతాలు దాదాపుగా అంతరించి పోయాయి. 13వ శతాబ్దం వచ్చేసరికి ఇవి రెండూ భారతదేశంలో ముఖ్యంగా ఆంధ్ర దేశంలోంచి నిశ్శేషంగా నశించిపోయాయనే చెప్పాలి. కానీ, టిబెట్ వారు దీని ఉనికిని కాపాడుకొంటూ వచ్చారు.

# కాలచక్రతంత్రానికి అక్షరాభ్యాసం



కాలచక్ర తంత్రానికి అక్షరాభ్యాసం (INITIATION) అంటే, బుద్ధత్వాన్ని (BUDDHA HOOD) పొందడానికి తాంత్రిక మార్గం ద్వారా ప్రయత్నించడం అని అర్థం.

ఇక్కడ ఒక్క క్షణం ఆగి, బుద్ధుడు బుద్ధత్వాన్ని పొందిన విధానాన్ని మనం గుర్తు చేసుకుందాం. బుద్ధత్వం పొందడం అంటే, ఈ సృష్టి రహస్యాన్ని అవగతం చేసుకోగలిగే జ్ఞానాన్ని పొందడం అని!

ఇందుకు ఉపవాసాలుంటూ, శరీరాన్ని శుష్కింప చేసుకొంటూ చేసే సాధన వలన (ASCETICISM) జ్ఞాన సిద్ధి కలగదని, తనని తాను ఎముకల పోగు అయిపోయేంతగా శుష్కింపచేసుకున్న తర్వాతే ఈ మార్గం వలన ఉపయోగం లేదని గ్రహించి, బుద్ధుడు కాశీనుంచి గయకు చేరుకొని కాలచక్ర మార్గాన జ్ఞానసిద్ధిని పొందాడు. సిద్ధార్థుడు, గౌతముడుగా పిలువబడిన ఆయన అప్పటినించి బుద్ధుడిగా మారాడు.

సాధారణ మానవులు కూడా అటువంటి బుద్ధత్వాన్ని పొందవచ్చు. అందుకు సులువైన మార్గాలు ఈ కాలచక్రతంత్రంలో బుద్ధుడు బోధించాడని అంటారు.

కాలచక్రతంత్ర మార్గాన సాధన చేస్తే సాధకుడు బుద్ధుడంతటి వాడౌతాడని దీని అర్థం.

కాలచక్ర అక్షరాభ్యాసం రెండు దశల్లో జరుగుతుంది. మొదటిదశలో సాధారణ ధ్యాన విధానాలు, రెండోదశలో ఆరు మహత్తర కాలచక్ర యోగాల్ని నేర్పించడం వుంటాయి. ఇవి నేర్చేసుకుంటే బుద్ధుడిగా అయిపోతాడా...? వాటిని నేర్చుకొని, సాధన చేస్తే, సాధన ఫలించి సాధకుడు బుద్ధుడుగా ఎదుగుతాడు!

సాధకుడిగా అంత సాధన చేయలేని వారికోసం, మొదటి దశ ఏడు కాలచక్ర విధానాల్ని అందిస్తారు.

# మనమూ కాలచక్రతంత్ర సాధకులం కావచ్చు

కాలచక్రతంత్ర మూలాల్ని పరిశీలించినప్పుడు ఒక విషయం స్పష్టం అవుతుంది- ఇది బౌద్ధులు ప్రవచించిన సిద్ధాంతమే అయినా, అన్ని దేశీయులు, అన్ని జాతీయులూ, అన్ని మతానుయాయులూ అందరూ జ్ఞాన సిద్ధిని పొందడం కోసం సాధన చేయదగిన ఒక తాంత్రిక ప్రక్రియ! ఇది ప్రపంచ శాంతికోసం నిర్వహిస్తు ఒక మహాయజ్ఞం. ఇందులో పాల్గొనడానికి అందరికీ ఆహ్వానం వుంది- కుల, మత, జాతి, దేశ, ప్రాంత, భాషా విభేదాలతో నిమిత్తం లేకుండా!!



బౌద్ధులకు ఇది అదనపు జ్ఞాన యోగ విధానం నేర్చుకోవడం అవుతుంది. బౌద్ధులు కాని వారికి వ్యక్తిత్వ వికాసం కోసం ఒక కొత్త తాంత్రిక విధానం సాధన చేసే అవకాశం ఏర్పడుతుంది!

ఈ కాలచక్రతంత్రాన్ని మెదడుతోనూ, మనసుతో కూడా సాధన చేయాలి. తద్వారా కాలవిజ్ఞానాన్ని సంతరించుకొని మనోవికాసాన్ని సాధించుకోగలగాలి.

విభిన్నమైన సంస్కృతుల్లో జీవిస్తున్న మానవులందరినీ ఏకం చేసే శక్తి కాలచక్రానికి వుంది. శంబల రాజు కాలచక్రతంత్రం ద్వారానే హిందువుల్ని బౌద్ధుల్నీ ఐక్యం చేయగలిగాడు. మనుషులు పూనుకొంటే, కాలచక్రం ఈనాటికీ ప్రపంచ మానవులందరినీ ఐక్యం చేయగలదు కూడా!

నిజానికి, ప్రపంచ మతాలు ఇతర మతస్థుల్ని సౌహార్ద్రతతో ఆహ్వానించి (Goodwill Gesture) తమ మతంలోని విశేషాల్ని, తోటి మానవుల పట్ల ప్రేమను చూపించే అంశాల్ని ఎత్తి చూపించి, పరిచయం చేయడం అనే అలవాటు చేసుకొంటే మంచిదే!

వివిధ దేశాలలో కాలచక్ర అక్షరాభ్యాస మహోత్సవాల్ని నిర్వహించడం ద్వారా టిబెట్ బౌద్ధం ఈ విధిని చక్కగా నెరవేరుస్తుంది. భిన్నమతాలకు కేంద్రంగా వున్న భారతదేశంలో ముఖ్యంగా ఈ సౌహార్ద్ర కార్యక్రమాలు చాలా అవసరమౌతాయి. ఆయా మతాలకు చెందిన ప్రముఖ ఉత్సవాల సందర్భంగా ఇతర మతస్థుల్ని తమ ప్రార్థన మందిరాలకు ఆహ్వానించి గౌరవించే అలవాటు చాలా అవసరం.

ప్రేమ, సత్యం, అహింసల్ని అన్ని మతాలూ బోధిస్తున్నాయి కానీ, ఆచరణలో ఇతర మతాల్ని, మతస్థుల్ని ద్వేషిస్తున్నాయి. ప్రపంచ శాంతికి పొంచివున్న ముప్పుల్లో ఇది ముఖ్యమైనదే!!

ఇలాంటి సౌహార్ద్రతని కొన్ని మతాలవారు మతాంతీకరణల కోసం ఉపయోగించుకునే ప్రమాదం లేకపోలేదు. బలవంతంగానూ, దౌర్జన్యంగానూ కూడా ఒక మతంవారిని ఇంకోమతంలోకి మార్పిడి చేసిన సంఘటనలు ఎన్నో జరిగాయి.

కాలచక్రతంత్రం మహిమాన్విత కార్యక్రమం 30th Kalachakra Empowerment- కేవలం ప్రపంచశాంతికి మాత్రమే ఉద్దేశించిన కార్యక్రమంగా దలైలామా స్పష్టీకరించారు. ఇక్కడ బౌద్ధులుగా మతమార్పిడి చేసే ప్రశ్నే లేదని ఆయన ప్రకటించారు.

# మూడు మనోమార్గాలు

కాలచక్రతంత్రం ద్వారా ఆధ్యాత్మిక ప్రగతి సాధించాలంటే. మూడు మనో మార్గాలను అనుసరించవలసి వుంటుంది.

1) పరిత్యాగం : ప్రాపంచిక సమస్యల నుంచి దూరంగా వుండాలనే అతి ముఖ్యమైన సంకల్పాన్ని సాధకుడు గట్టిగా కలిగి వుండాలి. దాన్ని RENUNCIA-TION అంటారు.



2) బోధి చిత్తం : విశ్వ మానవ దృష్టి కలిగి వుండడం– సమస్త మానవాళి మేలుకీ పాటుబడాలనే సంకల్పాన్ని "బోధి చిత్తం" అంటారు. కాలచక్రతంత్రం మౌలిక లక్షణం ఇది. ప్రపంచ మానవుడి కోసం పాటుబడటం.. అని!

ఆ విధమైన మనస్తత్వాన్ని కలిగిన వాళ్ళకే ఈ తంత్ర సాధన విజయవంతం అవుతుంది. స్వార్థపరులు, రాక్షస మనస్తత్వం కలిగిన కర్కశులు నియంతలకు ఈ తంత్రం గురించి తెలుసుకోవడం వినడం కూడా కష్టంగానే అనిపిస్తుందన్న మాట! బోధిచిత్తం అంటే కరుణార్ద్ర హృదయాన్ని కలిగి వుండడమే! అందుకు అడ్డుగా వుండే అన్ని మానసిక అవరోధాల్ని అధిగమించగలిగితే సాధకుడు విజయం సాధించగలుగుతాడు.

3) వాస్తవాన్ని వాస్తవంగా గుర్తించగలిగే వివేకం. ఎవరివలనో కష్టాలు కలుగుతున్నాయనీ, ఎవడో దుర్మార్గుడు ఇదంతా చేస్తున్నాడని అనుకోవం మానవ సహజ లక్షణం! మార్గాలన్నీ ముళ్ళబాటలనీ, వాటిని దాటేటంత శక్తి మనకు లేదని కూడా అనుకొంటూ వుంటాం. ప్రతిదీ అసాధ్యం అనుకోవడం మనలో వుండే ఒక వ్యతిరేక ప్రవృత్తి. అది సుసాధ్యమే అయినా అసాధ్యం అనుకొని విరమించు కొంటూ వుంటాం. మనకున్న శక్తిని, చేరవలసిన గమ్యానికి కావలసిన శక్తినీ సరిగ్గా అంచనా వేసుకున్నప్పుడు అదనంగా కావలసిన దాన్ని సమకూర్చుకోవడం ఎలాగో ఆలోచించ గలుగుతాంకదా! అదీ, వాస్తవాన్ని వాస్తవంగా గుర్తించగలగడం అంటే!

ఈ మూడు మనో మార్గాల్ని అనుసరించగలిగితేనే వ్యక్తిత్వ వికాసంకలిగి, కాలచక్రతంత్రాన్ని అభ్యసించే యోగ్యత సిద్ధిస్తుంది. ఆ మేరకు సాధకుని సంస్కరించేందుకోసం వజ్ర గురువు దలైలామా అనేక బోధనలు చేస్తారు.

# బోధిసత్వ వాగ్దానాలు

నూతన సాధకుణ్ణి ముందుగా సంస్కరించడం కోసం మొదటి రోజులన్నీ కేటాయించడం జరుగుతుంది. దాన్ని "PREPARATION CEREMONY" అంటారు. సాధకుడు నిజంగా, దృఢంగా కాలచక్రతంత్ర అభ్యాసకుడై బుద్ధత్వాన్ని పొందాలను కొంటున్నాడా... లేక, ఏదో సరదాగా ఇక్కడ ఎలా వుంటుందో చూద్దాం అని పరిశీలకుడిగా వచ్చాడా అనేది తేలిపోతుంది. అయోగ్యులకు ఈ తంత్ర విద్యలు బోధించడం నిషేధం.



ఇప్పటికి ఇలాంటి 30 అక్షరాభ్యాస కార్యక్రమాలు భారీ స్థాయిలో ప్రపంచ వ్యాప్తంగా నిర్వహించిన మహనీయుడు, వజ్రగురువు పూజ్యశ్రీ దలైలామా స్వయంగా ఈ తంత్ర సాధకతని ప్రసాదిస్తున్నప్పుడు, సాధకుడు కాగోరే వ్యక్తి యోగ్యాయోగ్యతలు తేలికగానే బైటపడతాయి. ఎదుటి వ్యక్తి వ్యక్తిత్వాన్ని స్కానింగ్ చేసినట్లు అవగాహన చేసుకునే శక్తి కాలచక్రతంత్ర గురువుకు సహజంగా వుంటుంది.

అందువలన మూడు మనో మార్గాల్ని అనుసరించాలనే దృఢ సంకల్పంతో ఎదురు చూసే వ్యక్తికే ఈ అవకాశం లభిస్తుందని మనం అర్థం చేసుకోవాలి!

ఎంపిక అయిన నూతన సాధకుడు ఏ విషయం గురించీ వ్యతిరేకంగా, నెగెటివ్ మనస్తత్వంతో ఆలోచించకుండా మనసా, వాచా, కర్మణా దృఢచిత్తంతో వ్యవహరిస్తానని గట్టి వాగ్దానం చేస్తాడు! పూజ్యశ్రీ దలైలామా గురువుకు వాగ్దానం చెయ్యడం అంటే, కోర్టుల్లో సాక్షులు, ముద్దాయిలూ చేసే ప్రమాణం లాంటిది కాదు- ఆ గీత దాటి కదిలేందుకు సాధకుడికి ఇంక అవకాశం వుండదు.

ఇతరులకు మేలు కల్గించే విధంగా తనను ప్రవర్తించకుండా నిరోధించే ఆలోచనా విధానాన్ని నెగెటివ్ ఆలోచనలు అంటారు. 'ఏదైనా మేలు చేద్దాం' అనుకున్నప్పుడు, వెంటనే "మనకెందుకు? మన దారిన మనం పోతే పోలేదా?" అని మన మనసులో మనకే అనిపించడం నెగెటివ్ ఆలోచన. దాన్ని అధిగమించలేకపోవడం, ఆ ఆలోచనకు లొంగిపోయి, ఎటువంటి ఉపకారం చెయ్యకుండా మిన్నకుండి పోవడం అంటే, సాధకుడు వైఫల్యం చెందినట్టు లెక్క!

ఇలా నెగిటివ్ ఆలోచనలకు లొంగకుండా వుంటానని దృఢంగా నిశ్చయించుకొని భగవంతుడికి వాగ్దానం చేసినప్పుడు రమ్మని పిలిచినా మనసులో నెగెటివ్ ఆలోచనలు రావు గాక రావు. మనలో అలాంటి ధృఢ ప్రవృత్తి లేన్నప్పుడే వ్యతిరేక ఆలోచనలు కలుగుతుంటాయని అర్థం చేసుకోవాలి. తనలాగే ఇతరులు దృఢచిత్తాన్ని సాధించుకోవడానికి ప్రయత్నాన్ని చేస్తున్నప్పుడు తన నెగెటివ్ ఆలోచనలతో వాళ్ళని చెడగొట్టే ప్రయత్నాలు చెయ్యనని కూడా ఈ నూతన సాధకుడు భగవంతుడికి వాగ్దానం చేస్తాడు.

ఈ వాగ్దానాలనే బోధిసత్వ వాగ్దానాలంటారు. నిజానికి భగవంతుడికి ఈ విధంగా వాగ్దానం చెయ్యడానికి మనం కాలచక్రతంత్ర సాధకులమే కానవసరం లేదు. బుద్ధి వికాసం కల్గిన ప్రతివ్యక్తీ ఇలాంటి ఉన్నత మనస్తత్వాన్ని సంతరించుకుని ఆచరణలో పెడతానని తను నమ్మే ఏ భగవంతుడికైనా వాగ్దానం ఇవ్వవచ్చు.

సాధకుల్ని ఈ విధంగా వాగ్దానం చెయ్య వలసిందిగా కాలచక్రతంత్రం తప్పనిసరిగా కోరుతుంది.

జీవకారుణ్యం, ఇతరులకు తోడ్పడటం, సత్యానికి, ధర్మానికి కట్టుబడి వుండటం... ఇవి ప్రముఖమైన లక్షణాలు ఈ తంత్రంలో! ఈ బోధిసత్వ ప్రతిజ్ఞలు తీసుకోవడానికి మతమే అవసరం లేదు. వ్యక్తులుగా మనమూ తీసుకోవచ్చు కదా... ఆలోచిద్దామా...!!!

కాలచక్రతంత్ర అక్షరాభ్యాసం (INITIATION) కోసం ఏ బౌద్ధారామంలోనో సాధకులు కాగోరే వారిని కూర్చోబెట్టి దీక్షనిచ్చి పంపించేయొచ్చు. కానీ, ఇన్ని కోట్లు ఖర్చుపెట్టి, ఇన్ని లక్షల మంది ప్రజల్ని ఆహ్వానించి, ప్రపంచ దేశాల నుంచి బౌద్ధ భిక్షువుల్ని రప్పించి అందరి సమక్షంలో ఇంత ఆర్భాటంగా ఎందుకు చేస్తున్నారంటే, ఇలాంటి

బోధిసత్వ మార్గాల గురించి విని, అర్థం చేసుకొని, ప్రపంచ అనుకూల మనస్తత్వాన్ని (POSITIVE FEELINGS) పెంపొందించుకోగలిగే అవకాశం వుంటుందని! మనలో వుండే వ్యతిరేక ప్రవృత్తుల్ని (NEGATIVE FEELINGS) వదులుకోవాలనే ఆలోచన చేయగలుగుతాం అని!

అందుకోసం- కేవలం ప్రపంచశాంతి కోసం ఈ కాలచక్రతంత్ర ప్రావేశిక మహోత్సవాన్ని ఇంత భారీగా నిర్వహిస్తున్నారు.

కాలచక్రతంత్ర కార్యక్రమాలను చూడడానికి రావాలంటే, మనం మన మతాన్ని మార్చుకొని బౌద్ధమతం స్వీకరించవలసిన పని లేదు.

బౌద్ధమత విధానాలతో మనకు ఎలాంటి నిమిత్తమూ లేదు.

బుద్ధుడు బోధించిన మార్గంలో వ్యతిరేక ఆలోచనలు వదులుకోవాలనే మనస్తత్వం కల్గించుకోవడం కోసం ఇప్పుడు మనం అమరావతి వెడ్తున్నాం... అంతే!

అవకాశం కుదిరి ఈ కార్యక్రమాలన్నింటిలోనూ ఉత్సాహంగా పాల్గొనగలిగితే, అనుకూల ఆలోచనలు వాటికవే మనలో మొలకెత్తుతాయి. ఒకవిధమైన తాదాత్మ్యకు మనం లోను కాగలుగుతాం. సాధకుడు ఎలాంటి ఉన్నత స్థితిని పొందగలుగుతాడో, మనం సాధకులం కాలేకపోయినా అలాంటి ఉన్నత స్థితిని పొందేందుకు అవకాశం వుంటుంది.

ఇందులో మతం పాత్ర ఏమీ లేదనేది స్పష్టమే కదా!



# దీక్ష ప్రదానంలో మొదటిరోజు విశేషాలు

బౌద్ధ భిక్షువులు మండల కార్యక్రమం ద్వారా తాము సంతరించుకున్న శక్తిని (POSITIVE ENERGY) ఈ ప్రపంచం కోసం విడుదల చేస్తారు... ఇది చిట్టచివరి కార్యక్రమంగా వుంటుంది!



తాను నేర్చుకొంటున్న ఈ తాంత్రిక విద్య పట్ల, నేర్పుతున్న గురువు పట్ల సద్భావన పెంచుకోవడం ద్వారా కాలచక్రతంత్ర దీక్ష తీసుకొంటున్న వ్యక్తి సాధకుడి వరుసలో చేర్తాడు. ఏ స్థాయిలో తాను సాధన చేయ దలుచుకున్నాడో ముందుగానే సాధకుడు నిర్ణయించుకోవాలి.

ప్రతిరోజూ విడువకుండా సాధన చేయ గలిగే వారికి మంచి ఫలితాలు వస్తాయి. సాధన ఫలిస్తుంది.

స్త్రీ పురుషులెవరైనా ఈ తాంత్రిక దీక్ష తీసుకోవచ్చు. ఇది ఒక సరికొత్త మానసిక స్థితిని కల్గిస్తుంది. ఈ మానసిక శక్తి వ్యక్తిలోని వ్యతిరేక ధోరణుల్ని దూరం చేయగలుగుతుంది. కాలచక్రతంత్ర సాధన కల్గించే మొదటి ప్రయోజనం ఇది.

కాలచక్రతంత్ర అక్షరాభ్యాస కార్యక్రమాన్ని "వోంగ్-ఖోర్" అంటారు. వోంగ్ ఖోర్ అంటే, సాధనకోసం అనుమతి (లేదా) అధికారం ఇవ్వడం అని! ఈ అధికారం ఇచ్చే గురువుని "వజ్ర గురువు" (VAJRA MASTER) అని కూడా పిలుస్తుంటారు. కాలచక్ర సాధకుడి మానసిక స్థితి వజ్రంలా దృఢంగానూ, ప్రకారంగానూ వుంటుందని దీని అర్థం. తద్వారా తాను సాధించుకున్న స్థితప్రజ్ఞతని ఈ లోకం అభ్యున్నతి కోసం వినియోగిస్తానని సాధకుడు మొదటి వాగ్దానం చేస్తాడు.

ఎన్నో పరీక్షలకు తట్టుకున్న తర్వాతే, కాలచక్ర తంత్ర దీక్ష తీసుకోవడానికి నూతన సాధకుడు ఎంపికవుతాడు. తాను శ్రద్ధతోనూ గౌరవంతోనూ సాధన చేస్తానని సాధకుడు ప్రతిజ్ఞ చేస్తాడు.

కాలచక్ర దీక్షా ప్రదానం (ఇనిషియేషన్) అంటే కాలచక్ర దేవతని తనలో ఆవహింప చేసుకోవడానికి ప్రయత్నించడం అని!

అందువలన నూతన సాధకుడిలో కొత్త మనోప్రవృత్తులు ఏర్పడతాయి. ఈ కొత్త మనో ప్రవృత్తులు మానవ సహజమైన ప్రతికూల ఆలోచనా విధానాన్ని (నెగెటివ్ మనస్తత్వం) తొలగిపోయేలా చేసి సాధకుడు కాలచక్ర చైతన్యం సంతరించుకునేలా ప్రోత్సహిస్తాయి.

అంటే దీక్ష ప్రారంభంలోనే వజ్ర గురువు తన సంకల్ప బలంతో సాధకుని మానసిక ప్రవృత్తుల్లోని కల్మషాల్ని కడిగి, మనసును శుద్ధి చేస్తారన్నమాట!

12 రోజుల దీక్షా ప్రదానం కార్యక్రమ విశేషాలు :-

1. దీక్షా ప్రదానం కోసం దేవతల్ని ఆవాహన చేస్తూ కాలచక్రతంత్ర ఇసుక మండల చిత్రాన్ని చిత్రించేందుకు ప్రత్యేకంగా ఒక స్థావరాన్ని సిద్ధం చేస్తారు. దీన్ని 'థెక్-పూ' అంటారు.
2. వజ్ర గురువు ఉన్నతాసనం మీద ఆసీనుడౌతాడు.
3. నూతన సాధకులు తమలో ఒక ప్రతినిధిని ఎంపిక చేసుకుంటారు. ఈ ప్రతినిధి వజ్ర గురువుని తమకు దీక్షా ప్రదానం చేయవలసిందిగా ప్రార్థిస్తాడు. కరుణామయుడైన గురువు అంగీకరిస్తారు.
4. వజ్ర గురువు పంచమహాభూతాలను ఆవాహన చేస్తారు. వసుధా నాట్యం (డాన్స్ ఆఫ్ ద ఎర్త్) చేస్తూ భిక్షువులు, సాధకులు భూమిని అనుమతించవలసిందిగా ప్రార్థిస్తారు. ఇలాగే ఇతర మహాభూతాల్ని ఆవాహన చేసి ప్రార్థిస్తారు.
5. టిబెట్ భాషలో పృథ్వీ భూతాన్ని 'తెన్మా' అంటారు. ఈ తెన్మ (పృథ్వీ భూతం) అనుమతి లభించిన తర్వాత తదుపరి దీక్ష కార్యక్రమం ప్రారంభిస్తారు.
6. రకరకాల దుష్ట భూతాత్మలు కూడా ఈ స్థలం చుట్టూ సంచరిస్తూ వుంటాయి. వాటినించి రక్షణ కోసం కొన్ని తాంత్రిక వస్తు సామాగ్రిని సిద్ధంగా వుంచుతారు. ఈ వస్తు సామాగ్రి అంతా చాలా పవిత్రమైనవి. వజ్ర గురువే వాటిని వినియోగింప చేస్తారు.
7. ఈ కార్యక్రమం తర్వాత ఇసుక మండలాన్ని గురువు చిత్రించడం ప్రారంభిస్తారు. అందుకు ప్రత్యేకమైన విధానం వుంది. ఈ కార్యక్రమంలో ఇదే ముఖ్య విషయం.

# మండల రచన

కాలచక్ర తంత్ర దీక్షా ప్రధాన కార్యక్రమం జరుగుతున్న 12 రోజులూ, చూసేవాళ్ళకి భజనలు, నృత్యాలు, ప్రార్థనలు మాత్రమే అక్కడ జరుగుతాయనిపిస్తాయి. కానీ, ఒక్కొక్క ప్రార్థనకు, నృత్యానికీ ఒక్కొక్క పరమార్థం వుంది.



దీక్షా ప్రదానానికి మండల చిత్రం చాలా ముఖ్యమైంది. మామూలుగా హిందువుల ఇళ్ళలో ఏవైనా క్రతువులు వగైరా జరిగేటప్పుడు ఒక మండలాన్ని ముగ్గులతో చిత్రించి, దానిపైన చితుకులు పేర్చి అగ్నిని ఆవాహన చేస్తారు. మండలం ముగ్గు అనేది సంబంధిత దేవతల్ని ఆవాహన చేయడాని కోసం ఉపయోగపడుతుంది. కొన్ని పవిత్రమైన వస్తువులతో దీన్ని చిత్రిస్తారు.

మండల చిత్రం ఎటు చూసినా ఏడు అడుగులుంటుంది. ఒక పొడవైన పవిత్ర సూత్రాన్ని (తాడు) కరిగించిన తెల్లసుద్దలో ముంచి, ఇద్దరు బిక్షువులు చెరొకవైపునా లాగి, గీత ఎంతవరకూ కావాలో అంత మేర నొక్కిపట్టి వుంచుతారు. వజ్రగురువు దలైలామా ఆ తాడుని లాగి వదుల్తారు. తెల్లగీత అచ్చుపడుతుంది. ఈ విధంగా మొత్తం మండల చిత్రం రేఖల్ని దలైలామాయే చిత్రిస్తారు. ఈ చిత్ర రచన పూర్తయ్యేందుకు రెండు రోజులు పడుతుంది.

ఇది ఒకవైపున జరుగుతూ వుండగా, బుద్ధదేవుని అనుమతి కోరుతూ ప్రార్థనలు, భజనలు, నృత్యాలు కొనసాగుతూ వుంటాయి.

ఇంక మూడవ రోజు ఉదయాన్నే ప్రార్థన చేసిన తర్వాత కుంకుమని తడిపి, ఈ తెల్లగీతల మీద మళ్ళీ చిత్రిస్తారు. అదనంగా వున్న గీతల్ని వజ్రగురువే చెరిపేస్తారు. 722 మంది దేవతల్ని ఆవాహన చేసి, వారు లోనికి ప్రవేశించేందుకు ద్వారాల్ని తెరుస్తారు. అదనపు గీతల్ని చెరపడం అంటే అర్థం అది.

ఈ చిత్రంలో ఏ దేవత ఎక్కడ అధిష్టించాలో తంత్ర గ్రంథాల్లో వివరించిన ప్రకారం, ఆ దేవతని అక్కడకు స్వాగతిస్తూ, కొన్ని గోధుమ గింజల్ని వుంచుతారు. వాటిమీద దేవతలు సుఖాసీనులవుతారని...!

తాంత్రిక దేవతలకు పవిత్రమైన స్థావరం ఇవ్వాలి. అందుకు ఈ మండల ముగ్గు ఏర్పాట్లు చేస్తారు! ఇదంతా తాంత్రిక విధానం. ఇది సాధకులలకు ఉద్దేశించిన విషయమే గానీ, జనసామాన్యానికి కాదు. సాధకులకు మాత్రమే దాని పరమార్థం అవగతం అవుతుంది.

# ఏడడుగుల
# అతి పెద్ద మండలం

కాలచక్రతంత్ర మండల చిత్రాన్ని తెల్లగీతలతో చిత్రించి కుంకుమతో అలంకరించిన తర్వాత ప్రత్యేక ప్రార్థనలు చేసి, ఈ మండల చిత్రాన్ని రంగు రంగుల ఇసుకతో పూరిస్తారు. ఇసుకతో చిత్రించినది కాబట్టి దీన్ని 'కాలచక్ర తంత్ర ఇసుక మండల చిత్రం' (వీల్ ఆఫ్ టైమ్ శాండ్ మండల) అని పిలుస్తారు.



మొట్టమొదటగా ఎరుపు, తెలుపు, నలుపు రంగుల్లో వున్న ఇసుక రేణువుల్ని తీసుకుని వజ్ర గురువు దలైలామా మండలం మధ్యలో వున్న మూడు సమాంతర రేఖల మధ్య నింపుతారు. ఈ మూడు సమాంతర రేఖలు బుద్ధుని శరీరానికి, వాక్కుకు, మనసుకు గుర్తులు.

రంగుల ఇసుకని గీత మధ్య నింపడానికి సన్నగా పొడవుగా వుండే గరాటుల్ని ఉపయోగిస్తారు. టిబెట్ భాషలో వీటిని 'చాక్‌పూ'లని వ్యవహరిస్తారు. ఇవి చాలా పవిత్రమైనవి తాంత్రిక దృష్ట్యా!

వజ్ర గురువు వాటికి పూజ్జ చేసి, వాటిని సంతృప్తి పరిచాకే ఈ గరాటులలో ఒక్క దానిలో ఒక్కో రంగు ఇసుకని నింపుతారు. దీని నోరు చాలా చిన్నదిగా, ఒక్కొక్క రేణువునే సన్నగా వదిలేందుకు వీలుగా వుంటుంది. ఎక్కువ ఇసుకని వదలాల్సి వచ్చినప్పుడు రెండు గరాటులు ఉపయోగిస్తారు.

'మండలం' మధ్య నుంచి మొదలుపెట్టి, ఇసుక నింపుతూ వస్తారు. ఏ స్థానంలో ఏ రంగు ఇసుకని ఎంత నింపాలో గ్రంథాల్లో సూచించిన ప్రకారం వజ్ర గురువు పర్యవేక్షిస్తారు. ఆయా రంగుల ప్రాముఖ్యతని, వాటి అధిష్టాన దేవతల్ని అధ్యయనం చెయ్యడానికి కనీసం 2 సంవత్సరాలు పడ్తుందని, అంత సమాచారం గ్రంథాలలో వుందనీ అంటారు. ఇసుకని నింపేటప్పుడు అటూ ఇటూ పడకుండా, గీతలు తిన్నగా వుండేలా సరిచేసుకునేందుకు ఒక చిన్న చెక్కని ఉపయోగిస్తారు. తాంత్రికంగా ఇది కూడా చాలా పవిత్రమైన వస్తువు. దీన్ని 'షింగా' అని పిలుస్తారు.

దీక్షా కార్యక్రమం మొదలైన తర్వాత మూడవ రోజున రంగుల ఇసుక నింపడం ప్రారంభం అవుతుంది. 7వ రోజు వరకు ఈ కార్యక్రమం కొనసాగుతుంది. అంటే, ఐదు రోజులు రంగు ఇసుక నింపడానికి పడ్తుందన్న మాట!

ఈ ఇసుక మండలాన్ని 'థేక్‌పూ' అనే ప్రత్యేక స్థావరంలో చిత్రిస్తారు. ఈ చిత్రించే విధానాన్ని మనం చూడడానికి అవకాశం వుండదు. మొదటి రోజున తెల్ల గీతలతో వజ్ర గురువు మండలాన్ని చిత్రించడం మొదలుపెట్టిన నాటి నుంచి, రంగుల ఇసుక నింపే వరకు 'థేక్ పూ' లోపల జరుగుతున్నది ఎవరికి కనిపించకుండా, చుట్టూ తెరలు కట్టి వుంచుతారు. ఎంపిక చేసిన బౌద్ధ భిక్షువులు మాత్రమే ఈ చిత్రరచనలో గురువుకు సహకరిస్తారు.

ఎనిమిదవ రోజున ఇసుక మండలం పూర్తి అయిన తర్వాత దలైలామా తనను అనుమతించి, సహకరించిన భూతాత్మలకు, దేవతలకు ధన్యవాదాలు తెలుపుతూ ప్రత్యేకంగా ఆహూతులు సమర్పిస్తారు.

ఆ సమయంలో పవిత్ర ఘంటారావం చేస్తారు. వివిధ వాయిద్యాలతో అద్భుత నాదాలు సృష్టిస్తారు. అందుకు అనుగుణంగా చక్కని నృత్యం చేస్తారు. 12 అడుగుల పొడవైన కొమ్ము బూరలతో మంగళ వాద్యాలు మ్రోగుతాయి.

ఒక గంటన్నరసేపు కృష్ణానదీతీరంలో అమరావతిలో హోరెత్తే అద్భుత బుద్ధ ఘోష అది! రక్తం ఉప్పొంగేంత ఉత్తేజకరమైన దృశ్యం...! దర్శించుకోగలిగిన వారి జన్మ ధన్యం!



# సమస్త ప్రాణుల పట్ల సమదృష్టి

కాలచక్రతంత్ర దీక్షా ప్రదాన కార్యక్రమంలో 9వ రోజున జరిగేది చాలా ముఖ్యమైన కార్యక్రమం. ఆ రోజున నూతన సాధకుల్ని దీక్షకు అనుకూలంగా చేస్తారు.

9వ రోజున అంటే, ఉదయం ఏడుగంటల నుంచి మధ్యాహ్నం 12 గంటల వరకూ సాధకుల ఆత్మశక్తినీ మనోబలాన్ని (సెల్ఫ్ జెనరేషన్) పెంపొందించే ప్రార్థనలు చేయిస్తారు. మధ్యాహ్నం 1 గంట నుంచీ సాధకుల దీక్షా ప్రదానానికి సంబంధించిన పలు కార్యక్రమాలను నిర్వహిస్తారు.

1. వజ్రగురువు దలైలామా మరియు బౌద్ధ భిక్షువులు వివిధ ప్రార్థనలు చేస్తారు. కొంతసేపు ధ్యాన మగ్నులై వుంటారు.

2. నూతన సాధకుల్ని అప్పుడు రంగ ప్రవేశం చేయిస్తారు. అంతవరకూ వారు ప్రార్థనల్లోనే గడుపుతారు.

3. తాము కరుణామయులమై వుంటామనీ, సమస్త ప్రాణుల్ని సమదృష్టితో చూస్తామనీ, సాటి మానవుల సంక్షేమం కోసం పాటుపడతామనీ, మండల రహస్యాలు ఎవరికీ వెల్లడి చెయ్యకుండా వుంటామనీ సాధకుల చేత మళ్ళీ ప్రమాణం చేయిస్తారు.

4. సాధకులకు దర్భల కట్టలు అందిస్తారు. కాలచక్రతంత్రంలో దర్భలకు ప్రాధాన్యత ఎక్కువ. బోధి వృక్షం నీడన దర్భలమీదే కూర్చుని బుద్ధుడు జ్ఞాన సిద్ధిని పొందాడు. సాధకులు కూర్చున్నప్పుడు, పడుకున్నప్పుడు కూడా దర్భల్ని తలగడ కింద, చాపకింద పరుచుకోవాలి.

నిద్రలో వున్నా మెలకువలో వున్నా సాధన కొనసాగుతూనే వుంటుంది. కలలో కూడా సాధకుడు ఎన్నో విషయాలు తెలుసుకుంటాడు. అవి మెలకువలో కూడా గుర్తుండటం కోసం దర్భల మీద శయనింప చేస్తారు సాధకుడు.

10వ రోజున సాధకులకు పండుగ దినం లాంటిది. ఆ రోజునే నిజమైన దీక్షా ప్రదానం జరుగుతుంది.

సాధకుల చేత ప్రార్థనలు చేయించి ఎర్రటి వస్త్ర ఖండాలతో కళ్ళకు గంతలు కట్టి ఒక్కొక్కరినే ఇసుక మండల చిత్రం దగ్గరకు తీసుకువెడతారు. అక్కడ గంతలు విప్పి, రంగుల మండలాన్ని దర్శింపచేస్తారు. తమసోమాజ్యోతిర్గమయ అన్నట్లు, చీకటి లోంచి వెలుతురులోకి ప్రయాణానికి ఇది చిహ్నం. మండల చిత్రాన్ని మొదటగా దర్శించగలిగేది దీక్ష తీసుకునే సాధకులే!

ఎనిమిది రోజుల పాటు ఏకధాటిగా చిత్రించిన ఈ ఇసుక మండల చిత్రాన్ని సాధారణ ప్రజానీకంగానీ, ఇతర బౌద్ధ భిక్షువులు గానీ చూసే అవకాశం అప్పుడే రాదు. దానికి మరికొంత కార్యక్రమం జరగవలసి వుంది.

# ఏడు రకాల సంస్కారాలు

నూతన సాధకులంతా మొదటిసారిగా 'థేక్-పూ' ప్రత్యేక స్థలంలో ఎనిమిది రోజులపాటు రంగులు ఇసుకతో చిత్రించిన కాలచక్ర తంత్ర మండల చిత్రాన్ని దర్శించడం వారికొక పునర్జన్మ లాంటిది. కాలచక్ర సాధకుడు మండల చిత్రదర్శనం కాగానే ద్విజుడౌతాడు. ఉపనయనం చేశాక బ్రాహ్మణుడు ద్విజుడైనట్లే, కాలచక్రతంత్ర దీక్ష తీసుకునే సాధకుడు మండల దర్శనం చేసుకోగానే ద్విజుడౌతాడు. (TWICE BORN).

చంటి బిడ్డడికి బౌద్ధ ధర్మాల ప్రకారం ఏడు రకాల సంస్కారాలు చేస్తారు. ద్విజులుగా మారిన ఈ సాధకులు కూడా కొత్తగా పుట్టిన వారితో సమానం కాబట్టి వీరికీ ఈ ఏడురకాల సంస్కారాలనూ వజ్రగురువే స్వయంగా జరిపిస్తారు. మండల ప్రపంచంలో కొత్త జన్మ ఎత్తడంగా కాలచక్ర తాంత్రికులు దీన్ని భావిస్తారు.

ఇక్కడితో సాధకులు ద్విజత్వాన్ని పొందడం పూర్తవుతుంది. ఇంకవీరు కాలచక్రం ఆదర్శ ప్రపంచంలోకి అడుగిడబోతున్నట్లు లెక్క! ఇదంతా 11వ రోజున కార్యక్రమం.

ఏడు రకాలుగా కాలచక్రతంత్రంలోకి ప్రవేశింపచేయడం (INITIATION) అంటే, బాల్యంలో నామకరణం, మొదటిస్నానం, వెంట్రుకలు ఇవ్వడం, పంచేంద్రియాల ద్వారా విషయ గ్రహణం చేయడం, చెవులు కుట్టించడం, మొదటిమాట పలకడం, అక్షరాభ్యాసం... ఇలా ఏడు ప్రముఖ దశలకూ ఈ ఏడు ప్రావేశికలూ ప్రాతినిధ్యం వహిస్తాయి. నూతన సాధకుడు తిరిగి జన్మించాడు కాబట్టి, బాల్యంలో చేసే ఏడు కర్మలూ చేయడంగా దీన్ని మనం అర్థం చేసుకోవచ్చు.

ఈ "మళ్ళీ జన్మ"లో బాల్యావస్థ దాటిన తర్వాత కాలచక్ర ఆదర్శ ప్రపంచంలోకి అడుగు పెడతారు. అది జ్ఞాన ప్రపంచం. దాన్ని కాలచక్ర దేవత పాలిస్తున్నాడు. అప్పుడు వాళ్ళు రంగుల్లో చిత్రించిన మండల చిత్రాన్ని కళ్ళారా చూస్తారు. దాని రంగుల ఫొటోని మనం చూడ్డానికీ, కాలచక్రతంత్ర సాధకుడు ఇలా పునర్జన్మ పొంది గురువు అనుమతితో ఇసుక మండలాన్ని నేరుగా చూడడానికి చాలా తేడా వుంటుంది!

# దేవతలకు ఉద్వాసన

తాను ఆవాహన చేసి స్వాగతించగానే వచ్చి కార్యక్రమాన్ని నిర్విఘ్నంగా జరిపించినందుకు 722 మంది దేవతలకు ధన్యవాదాలు తెలుపుతూ వజ్రగురువు దలైలామా, 12వ రోజున ప్రార్థనలు చేస్తారు. ఆ తర్వాత ఆయా దేవతలకు ఉద్వాసన పలుకుతారు.

దేవతల నిష్క్రమణ జరిగిన తర్వాత వజ్రగురువు కాలచక్ర ఇసుక మండల చిత్రాన్ని తొలగించే కార్యక్రమం ప్రారంభిస్తారు. దానికోసం ఆయన ప్రార్థనలు చేసి, కాల పురుషుడి అనుమతితో మండలం బయటవైపు చక్రంలోని ఇసుకను కొద్దిగా చేత్తో తొలగిస్తారు. గురువు సూచన మేరకు బిక్షువులు బ్రష్ వంటి ఒక పవిత్ర వస్తువుతో మండలంలోని ఇసుకనంతా మధ్యకు పోగేసుకువస్తారు. ఇది జరుగుతున్నంత సేపూ భజనలు, వాయిద్య ఘోషతో సభాస్థలి హోరెత్తిపోతూ వుంటుంది. ఈ రంగుల ఇసుకని బౌద్ధ మంత్రాలతో శాస్త్రోక్తంగా నదిలోకి తీసుకువెళ్ళి నిమజ్జనం చేస్తారు. ఈ ఉత్సవంలో ఇది చివరి కార్యక్రమం.



# కాలచక్ర తంత్రంతో
# మన అనుబంధం

30వ కాలచక్ర తంత్ర దీక్షా ప్రధాన కార్యక్రమం అమరావతిలో జరగడానికి కొన్ని ప్రత్యేకతలున్నాయి.

1) బౌద్ధ గ్రంథాలు ఆధారంగా, బుద్ధుడు నిర్యాణం చెందిన 2550వ సంవత్సరం ఇది.

2) బుద్ధుడే స్వయంగా కాలచక్ర తంత్రాన్ని రూపొందించి ప్రబోధించాడనీ, మొదటిసారిగా ఆయనే, అమరావతిలో అనేకమంది భిక్షువులకు దీక్షా ప్రదానం చేశాడనీ టిబెట్ బౌద్ధుల నమ్మకం.

3) టిబెట్‌లో దాపాంగ్ అనే చోట ఒక బౌద్ధ స్తూపాన్ని క్రీ.శ.1-2 శతాబ్దాల కాలంలో నిర్మించారు. అది అమరావతి స్తూపం నమూనాలోనే తయారయ్యిందని బౌద్ధ గ్రంథాల్లో వుంది. దాపాంగ్ అంటే ధాన్యాగారం. అమరావతిని ఆ రోజుల్లో 'ధాన్య కటకం' అని పిలిచే వారు. ఆనాటికే తెలుగు బౌద్ధులకు టిబెట్‌తో సంబంధాలుండేవని ముందే మనం చెప్పుకొన్నాం.

4) అమరావతిలో తాంత్రిక బౌద్ధాన్ని 13వ శతాబ్ది వరకూ పాటించారనడానికి తగిన ఆధారాలున్నాయి. 1344లో ఒక సింహళ భిక్షువు ప్రముఖ బౌద్ధ క్షేత్రంగా అమరావతిని సందర్శించాడని శ్రీలంక బౌద్ధ గ్రంథాల్లో వుంది.

5) అమరావతిలోనే పుట్టి, అమరావతిలోనే అభివృద్ధి చెంది, ఇతర బౌద్ధ ధర్మాలతో పాటు కాలచక్రతంత్రం కూడా టిబెట్‌కు చేరిందని పరిశోధకులు భావిస్తారు. టిబెట్ బౌద్ధులు ఈనాటివరకూ కాలచక్రతంత్రాన్ని నిలబెట్టుకొంటూ వచ్చారు. ఏడెనిమిది వందల ఏళ్ళ తర్వాత తొలిసారిగా ఈ నేలమీద కాలచక్రతంత్ర దీక్ష ఇచ్చే కార్యక్రమం ఇప్పుడు జరుగుతోంది. చారిత్రాత్మకమైన ఈ సంఘటన మన జీవితకాలంలో జరగడం ఒక విశేషం.

బౌద్ధ ధర్మాలకు సంబంధించిన ప్రజ్ఞా పారామిత సూత్రాలు, విమలకీర్తి నిర్దేశ సూత్రాలు, సుఖవతి- వ్యూహసూత్రాలు, సద్ధర్మ పుండరీక సూత్రాలు... ఇవన్నీ తెలుగు బౌద్ధులు వెలువరించిన ప్రముఖ గ్రంథాలు.

తెలుగు నేల నేలిన నాగుల నుంచి ఆచార్య నాగార్జునుడు ప్రజ్ఞాపారామిత సూత్ర గ్రంథాన్ని సంపాదించాడట! 'లంకావతార సూత్ర' అనే గ్రంథం కూడా తెలుగు బౌద్ధులు వెలయించినదే.

ఇంక కాలచక్ర విషయానికి వస్తే, టిబెట్ నుంచి ఎవరో విదేశీ బౌద్ధులు వచ్చి ఇక్కడ ఏదో కార్యక్రమం చేసుకువెళ్తున్నారనుకోవడం పొరబాటు. కాలచక్రతంత్రంతో తెలుగువారికి 18 శతాబ్దాల అనుబంధం వుంది. కాలచక్ర తంత్రంలోని అనేక ఆచారాలను ఇప్పటికీ మనకు తెలియకుండానే మనం పాటిస్తున్నాం. ఇదీ విశేషం.

# కాలపురుషుని విశ్వరూపం

కాలచక్రతంత్ర సాధన కూడా ఒకవిధమైన యోగసాధనలాంటిదే. దీని వలన సాధకుడిలో చైతన్య స్రావాలు విడుదల అవుతాయి. ఈ స్రావాన్ని తాంత్రిక భాషలో 'సోమం' అంటారు. కాలచక్రదేవతలకు తన శరీరంలోని సోమాన్ని (యోగిక స్రావాల్ని) సాధకుడు అర్పణ చేసుకొంటాడు. ఈ అర్పణని ఒక త్యాగంగా భావిస్తారు.

కాలచక్రతంత్రంలో కుండలి అంటే యౌగిక అగ్ని! రగిలిన యోగిక అగ్ని సాధకుడిలోని కల్మషాన్ని దహించివేసి శుద్ధి చేస్తుంది. శుద్ధమైన అంతఃకరణలతో సాధనని కొనసాగిస్తే, బుద్ధత్వాన్ని లేదా బోధి చిత్తాన్ని సాధించగలుగుతాడు. ఇది సాధకుడికి అంతిమ లక్ష్యంగా వుంటుంది.

కాలచక్రతంత్రంలో మూడు ముఖ్య భాగాలున్నాయి. మొదటిది బాహ్యచక్రం. ఇందులో ఈ సమస్తమైన విశ్వాంతరాళం అంతా వివరించబడ్తుంది. రెండవది అంతశ్చక్రం. ఇందులో శరీరం, అవయవాలు స్రోతస్సులు, స్రోతోద్రవాలు వివరించబడతాయి. మూడవది ప్రత్యామ్నాయ కాలచక్రం. ఈ జీవితగమనానికి ప్రత్యామ్నాయమైన ఆధ్యాత్మిక పథాన్ని ఇందులో సూచించడం జరుగుతుంది.

అంతశ్చక్రంలో చెప్పిన తాంత్రిక విధానాల ద్వారా శుద్ధి చెందిన సాధకుడు ప్రత్యామ్నాయ చక్రంలో సూచించిన ఆధ్యాత్మిక మార్గంలో కాల పురుషుని చేరుకోగలుగు తాడు. నాలుగు ముఖాలు, 24 చేతులు కలిగిన కాలచక్ర దేవత విశ్వరూపాన్ని సందర్శించ గలుగుతాడు.

కాలచక్రతంత్ర స్వరూపాన్ని బుద్ధుడు జ్ఞానసిద్ధి పొందిన 15వ రోజున పౌర్ణమినాడు ఉపదేశించాడు. రాజ్‌గిర్‌లోని గృద్ధ్రకూటంలో ఈ ఉపదేశం చేశాడు. ఆ తర్వాత మరొక ఏడాదికి నిర్యాణం పొందుతాడనగా, ధాన్యకటకం (అమరావతి)లో సుచంద్రుడనే శంబల రాజుకి ఇంకా అనేక మంది బిక్షువులకూ కాలచక్రతంత్ర మూల సూత్రాన్ని ఉపదేశించాడని బౌద్ధ గ్రంథాలు చెపుతున్నాయి.

# ఇసుక మండలం విశేషాలు

రంగుల ఇసుకతో చిత్రించిన ఈ కాలచక్ర చిత్రం (SAND MANDALA) లో 722 మంది, దేవతలు వారి వారి స్థానాలను పొంది వుంటారు. చతుర్ముఖుడైన కాలచక్ర దేవుడు కూడా వారితో పాటు ఈ చిత్రంలో ఉన్నత స్థానంలో వుంటారు.

నాలుగు రంగుల్లో నాలుగు స్థూపాకారపు గీతలు చిత్రించబడి వుంటాయి. నాలుగు దిక్కులనూ చూస్తున్న కాలదేవత నాలుగు ముఖాలకు ఈ రంగులు గుర్తులుగా వుంటాయి. నల్లని నీలం తూర్పు దిశన, ఎరుపు దక్షిణ దిశన, తెలుపు ఉత్తర దిశ, పసుపు (లేదా) కషాయం పడమరన చిత్రించ బడి వుంటాయి.



నల్లని నీలం (ముఖం) ఎదురుగా చూస్తున్నట్లుంటుంది. ఎరుపు కుడివైపున, తెలుపు ఎడమవైపునా, పసుపు వెనకవైపునా చిత్రించబడి వుంటాయి. కాలదేవత కాకుండా ఇంకా 721 మంది దేవతలు, అనేక జంతువులు, పుష్పాలు, ఆభరణాలు కూడా మండల చిత్రంలో కన్పిస్తాయి.

ఈ మండల చక్రంలో పెద్ద చదరంగా కన్పించే ప్రాంతం కాలదేవత రాజసౌధం లాంటిది! ఈ భవనం ఐదు అంతస్థుల్లో వుంటుంది. నాలుగు వైపులా ప్రతి అంతస్థుకు ఒక్కోద్వారం చొప్పున కన్పిస్తాయి.

సాధకులు ఈ ఒక్కో అంతస్థునీ ఆయా ద్వారాలు దాటుకొంటూ ప్రవేశించి సాధన చేస్తూ మధ్యలోని పద్మం దగ్గరకు చేరుకోగలగాలి. ఇదీ ఇందులో రహస్యం. ఈ ఐదంచెల చదరంలో ప్రతి చదరం బుద్ధిమతని పొందడానికి ఒక దశగా భావించవలసి వుంటుంది.

ఈ ఇసుక మండల చిత్రం బల్లపరుపుగా వున్నప్పటికీ దాన్ని మనం మూడు నిడువుల చిత్రం (3 Dimensians Figure) గా దర్శించగలిగితేనే కాలచక్ర తంత్ర అనుభూతిని పొందగలుగుతాం.

ఈ పుస్తకాన్ని చదువుతున్న మా పాఠకులు అలాంటి తాదాత్మ్యతో చదివితే అందులోని రహస్యాన్ని అర్థం చేసుకోవడానికి, అవగాహన చేసుకోవడానికి అవకాశం వుంటుందని మనవి!

బొమ్మకి అడుగున వున్న మొదటి ప్రవేశ మహాద్వారం కాలచక్రానికి తూర్పు ద్వారం. ఇది నలుపు రంగులో వుంటుంది. ఇది కాలచక్ర దేవత భవనానికి మొదటి అంతస్థు. దీన్ని ప్రకాశ శరీర మండలం (Mandala of the enlightened Body) అని పిలుస్తారు.

అందులోంచి తిన్నగా లోనికి వెడితే మరొక మహాద్వారం కనిపిస్తుంది. ఇది మొదటి దాని కన్నా ఇంకొక అంతస్థు ఎక్కువగా వున్న జ్ఞాన భూమిక. దీన్ని ప్రకాశ వాక్కు మండలం (Enlightened Speech Mandala) అంటారు. అలా మూడో మహాద్వారం చిన్నదిగా కనిపిస్తోంది చూశారా... అది ప్రకాశ మనో మండలం (Enlightened Mind Mandala). ఆఖరున ఉన్నది ప్రకాశ విజ్ఞాన మండలం (Enlightened Wisdom Mandala).

ప్రకాశ విజ్ఞాన మండలంలోకి ప్రవేశించిన తర్వాత మరొక చదరం కన్పిస్తుంది. ఇది కాలచక్ర దేవత భవనానికి అన్నింటికన్నా పై అంతస్థు. అందులో ఎనిమిది పత్రాల పద్మం వుంది. దాని మధ్యలో కాలచక్ర దేవుడు, విశ్వమాత ప్రతిష్ఠితులై వుంటారు. కాలచక్ర పురుషుడి విజ్ఞానం, విశ్వమాత యొక్క తల్లి ప్రేమ జీవకారుణ్యాల్ని ఈ మూర్తులు ప్రతిబింబిస్తాయి.

ఇలా ఆధ్యాత్మికపరమైన భావాన్నిచ్చే గుర్తులు (Symbols) అనేకం ఈ ఇసుక మండల చిత్రంలో కన్పిస్తాయి.

పైకి కనిపించే మొదటి చదరం అత్యంత ప్రాథమికమైన స్థాయికి సంబంధించింది. మధ్యలో కన్పించే చిన్న చదరం అత్యంత ఉన్నతమైన స్థాయికి సంబంధించింది.

ప్రాథమిక స్థాయిలోని చక్రాలలో 12 జంతువులు చిత్రించబడి వున్నాయి. పన్నెండూ పన్నెండు నెలలకు ప్రాతినిధ్యం వహిస్తాయి. ఒక్కో జంతువు ఒక్కో పద్మాన్ని ఆశ్రయించుకొని వుంటుంది. ఒక్కో పద్మం 30 మంది దేవతలకు స్థానంగా వుంటుంది.

ఇసుక మండల చిత్రం చుట్టూ వున్న వలయాలు సృష్టి ప్రాచీనతకు గుర్తులుగా వుంటాయి. పసుపురంగు భూమినీ, అలలుగా వున్న తెల్లగీతలు జలాన్ని, ఎరుపు అగ్నినీ, బూడిదరంగు వాయువునీ అన్నింటికన్నా బైట వున్న మొదటి వలయం ఆకాశాన్నీ, అంతరిక్షాన్నీ, చైతన్యాన్ని సూచిస్తాయి.



**(సాధకులు ఉపయోగించే పవిత్ర వస్తువులు)**

వజ్ర గురువు అందించిన దివ్య చక్షువులతో సాధకుడు ఈ ఒక్కొక్క వలయంలోంచి నెమ్మదిగా సాధన చేస్తూ చదరాలలోకి వెడతాడన్నమాట! అదీ జ్ఞాన సిద్ధిని పొందే ఉపాయం.

జ్ఞానాన్ని పొందడానికి ఒక్కొ అంతస్థునీ ఎంతో సాధన చేస్తే గానీ, సాధకుడు అధిరోహించలేడని కూడా మనం అర్థం చేసుకోవాలి. అందుకు సర్వ సమర్థుడైన గురువు కావాలి. కాలచక్రతంత్రం వజ్రగురువు అనుగ్రహంతోనే సాధకుడికి స్వాధీనం అవుతుందని కూడా మనం అర్థం చేసుకోవాలి.

కాలచక్ర సిద్ధాంతం బౌద్ధ ధర్మాలలో అత్యున్నతమైన ధర్మాలలో ఒకటి! దీన్ని ఆచరించేందుకు మానవులందరికీ హక్కుంది. తనను తాను సంస్కరించుకున్న మనిషి శారీరకంగానూ, మానసికంగానూ ఉన్నతుడై రాగద్వేషాలకు అతీతంగా ప్రపంచ శాంతిని ఆకాంక్షించే వాడుగా ఉండాలి అలా వున్న వ్యక్తికే ఈ కాలచక్రతంత్రం సిద్ధిస్తుంది. అందుకు వజ్రగురువు అనుగ్రహము, సహకారం, ప్రోత్సాహం కావాలి.

# కాలచక్రం
# ఇసుక మండల చిత్రం వివరణ



పటంలో చూపించిన సంఖ్య

1. అత్యున్నత స్థాయి (Mandala of Great Bliss) మధ్యలో పద్మం, దాన్ని స్థావరంగా ఆరుగురు మహాదేవతలు. కాలచక్ర దేవుడు, విశ్వమాత, ఆర్షోభ్య దేవత, ప్రజ్ఞాపారామిత దేవత, వజ్ర సత్త్వ దేవత, వజ్ర ధాత్విష్వరి దేవతలు ఎనిమిది శక్తుల సంరక్షణలో ఈ పద్మాన్ని ఆశ్రయించుకొని వుంటారు. ఇదే అసలైన జ్ఞానభూమిక.

2. ప్రకాశవంతమైన విజ్ఞాన మండలం. (Mandala of Enlightened Wisdom)

3. ప్రకాశవంతమైన మానసిక మండలం. (Mandala of enlightened Mind)

4. ప్రకాశవంతమైన వాక్కు మండలం (Mandala of enlightened speech)

5. ప్రకాశవంతమైన శరీర మండలం (Mandala of enlightened Body)

6. సంవత్సరానికి 12 నెలల్ని ప్రాతినిధ్యం వహిస్తున్న జంతువుల చిత్రాలు (Animals representing the months of year)

7. సగం వజ్రాలు, సగం చంద్రవంకలు - ఎర్రటి ఆభరణాలతో అలంకారం.

8. పంచమహాభూతాలతో పాటు ఆరవదయిన విజ్ఞానాన్ని కూడా ఒక మహాభూతంగా పేర్కొనడం జరిగింది. అలాగే చైతన్యాన్ని కూడా ఒక మహాభూతం (element) గా కాలచక్ర తంత్రం భావిస్తుంది.

9. 36 సంస్కృత బీజాక్షరాలు 36 మంది దేవతలకు ప్రాతినిధ్యం వహిస్తాయి.

10. రెండు వజ్ర ద్వయాలు అంటే, నాలుగు వజ్రాలు నాలుగు దిశలకు మార్గాలు.

11. ముత్యాలతో చేర్చిన పుష్పమాలలు, అర్ధమాలలు ఎనిమిదీ, ఎనిమంది పవిత్ర దేవతలకు గుర్తులు.

12. పై అంతస్థు లోంచి వర్షపు నీటిని బైటకు పంపే తూములు (Down Spouts) చిత్రించబడి వున్నాయి.

13. అర్ధ పద్మ చిత్రాలు మానసిక ఉద్వేగాలను అదుపు చేసుకోవడాన్ని ఇవి గుర్తు చేస్తాయి.

14. ఒక్కో రథాన్ని ఏడు ఏనుగులు లాగుతున్నాయి. ఒక్కో రథంలో రక్షకులైన ఇద్దరు దేవతలు చొప్పున వుంటారు. పశ్చిమ మహాద్వారం దగ్గర ఏడు ఏనుగుల రథాన్ని గమనించండి. (Seven Animals Pulling a chariot that pulls two protective deities)

15. ప్రకాశవంతమైన శరీర మండలం పశ్చిమ మహాద్వారం. Western gate of the Mandala of enlightened Body.

16. "అర్పణ" వనాలు (Offering Gardens)

17. పృథ్వి మహాభూతానికి చెందిన వలయం. ఎక్కడికక్కడ శృంఖలా బద్ధంగా కన్పిస్తుంది. భూమికున్న స్థిరత్వానికి ఇది గుర్తు (earth element circle)

18. జల మహాభూతానికి చెందిన వలయం, అలల వంటి గీతల్ని చూడవచ్చు. (Water Element Circle)

19. ఎనిమిది కాళ్ళ సింహం ఒక రథాన్ని లాగుతోంది. అందులో రౌద్ర మూర్తులైన ఇద్దరు రక్షక దేవతలున్నారు. ఈ ఎనిమిది కాళ్ళ సింహాన్ని టిబెట్ భాషలో "సెంజి కంగ్పా గ్యేపా" అంటారు ఈ ఎనిమిది కాళ్ళ సింహాన్ని టిబెట్ భాషలో (SENGE KANGPA GYEPA-AN EIGHT LEGGED LION PULLING A CART CONTAINING OW WRATHFUL PROTECTIVE DEITIES)

20. అగ్ని మహాభూతానికి సంబంధించిన ఎర్రటి వలయం. (Fire element Circle)

21. వాయు మహాభూతానికి సంబంధించిన బూడిద రంగు వలయం (Wind element circle)

22. ధర్మచక్రం దానిమధ్య ఇద్దరు ధర్మదేవతలు ప్రతిష్ఠితులై వుంటారు. (Wheel of Dharma with a pair of protective deities in the centre)

23. సంస్కృత బీజాక్షరాలు (Sanskrit Seed Syllables)

24. ఆకాశ మహాభూతానికి చెందిన వలయం (Space element Circle)

25. విజ్ఞాన మహాభూతానికి చెందిన ప్రాథమిక వలయం, దీని మహా సంరక్షణ వలయం అని కూడా అంటారు.

Wisdom element circle also known as the great protective circle.

# కాలచక్ర తంత్రానికి మూలసూత్రాలు



1. వజ్రగురువులకు అణుకువతో వుండటం మొదటి సూత్రం. వజ్రగురువు, తాంత్రిక గురువు అయిన పూజ్యశ్రీ దలైలామా అనుగ్రహం వుంటేనే ఆయన ద్వారా దీక్ష పొందిన సాధకుడికి ఈ తంత్రం పట్టుబడ్తుంది. గురువు అనుగ్రహం పొందడం కోసం సాధకుడు చాలా కష్టపడాలి. అన్నింటికన్నా ముందు, అతనిలోని వ్యతిరేక (నెగిటివ్) ఆలోచనల్ని వదులుకుని సానుకూల మనస్తత్వం పెంపొందించు కోవాలి. ఈ మనస్తత్వం కలిగినవాడే కాలచక్రతంత్ర దీక్ష తీసుకోవడానికి ముందుకు రాగలుగుతాడు.

2. గురువు ఆజ్ఞని పాటించడం రెండవ సూత్రం. 'వద్దు' అన్న పనిని వద్దని వదిలేయగలిగే వాడే శిష్యుడిగా రాణించ గలుగుతాడు. ఏ విధంగా నడుచు కొంటానని గురువుకు వాగ్దానం చేశాడో ఆ మాటని నిలబెట్టు కోవడం సాధకుడికి చాలా అవసరం.

ఇతర యోగ విద్యల గురువులకూ, కాలచక్రతంత్ర గురువుకూ చాలా వ్యత్యాసం వుంది. తాంత్రిక గురువు పవిత్రాత్మ! ఆయన ముందు సాధకుడు ప్రత్యేకంగా తన ఆలోచనా విధానాన్ని ప్రదర్శించి నిరూపించు కోనవసరంలేదు- ఆ సాధకుడు ఏమిటో అతన్ని చూడగానే వజ్ర గురువు గ్రహించ గలుగుతాడు.

3. కోపం, ఆవేశం, నిర్లక్ష్యం. ఇవి సాధకుణ్ణి అధః పాతాళానికి తోసేసే అంశాలు. వజ్ర సోదరుల్ని, సోదరీల్ని శాంతంగా ఆదరించాలి. సాటి మానవుల పట్ల గౌరవంతోనూ, అభిమానంతోనూ వ్యవహరించాలి.

4. విషాద సమయంలో స్థిత ప్రజ్ఞత కావాలి : వ్యక్తిగత జీవితంలో విషాదం ఏర్పడినప్పుడు స్థిరత్వాన్ని కోల్పోకూడదు. దృఢంగా నిలబడాలి. భవబంధాలకు అతీతంగా వ్యవహరించ గలగాలి. "ఈ మిథిలా నగరం నా స్వంత ఆస్తికాదు. ఇదంతా ఒక్కసారిగా తగలబడిపోతే, ఇందులో పోయేది నాదంటూ ఏమీ లేదని జనకుడు అన్నాడు. అదిగో అలాంటి నిర్లిప్త స్థితిని సాధకుడు సాధించుకోగలగాలి. స్థితప్రజ్ఞత అంటే అది!

5. బోధిచిత్త సముపార్జన కాలచక్రతంత్రంలో ముఖ్యమైన మూలసూత్రం : "బోధిచిత్తం" అంటే సమస్త మానవాళికి ప్రయోజన కారకంగా వ్యక్తి తనను తాను సంస్కరించుకోవడం. ఈ రకమైన స్థితిని సముపార్జించు కోవడం కోసం సాధకుడు చాలా కాలం సాధన చేసి, అలాంటి మానసిక స్థితిని పొందిన తర్వాతే కాలచక్ర తంత్ర అభ్యాసకుడిగా ప్రవేశించ గలుగుతాడు.

రాగద్వేషాలను ప్రదర్శించిన ప్రతిసారీ మనశరీరంలోని కొన్ని కుంద బిందువుల్ని (Jasmine flowers drops) మనం ప్రతిరోజూ నష్టపోతూ వుంటాం! యోగ విధానాల ద్వారా ఈ బిందువుల్ని తిరిగి సేకరించుకోగలగాలి. 21,600 బిందువులు వున్నప్పుడు, "బోధిచిత్తం" సంపూర్తిగా వున్నట్లు అర్థం!

ఈ సంఖ్య కాలచక్రం ప్రకారం సంవత్సరానికి గల ఘడియల సంఖ్యతో సమానం. "21,600" బిందువుల్ని మనం ఎంతో మానసిక సాధన చేస్తేనే సంపాదించుకోగలుగుతాం అన్నమాట! రాగ ద్వేషాలు ఏర్పడినప్పుడు, వ్యతిరేక ఆలోచనలు చేసినప్పుడు కొన్ని బిందువులను నష్టపోతే ఆ మేరకు బోధిచిత్తాన్ని కూడా నష్టపోయినట్టు లెక్క! సాధించుకున్న శక్తిని నెగిటివ్ ధోరణి నశింపచేస్తుందని అర్థం చేసుకోవాలి!

మామూలు మనుషుల విషయంలోనే ఇది అనుభవంలోని విషయం అయినప్పుడు సాధకుడి విషయంలో మరింతగా జరుగుతుంది. మన పురాణాల్లో మహర్షులు కోపం తెచ్చుకొని శాపం పెట్టడం, తద్వారా తపోశక్తిని కోల్పోయి, మళ్ళీ తపస్సు ద్వారా ఆ శక్తిని పొందగలగడం వంటి కథలు మనం చదివే వున్నాం. ముక్కు మూసుకుని కూర్చుని ఆలోచన చేసేకన్నా, దాని ఆచరణలో పెట్టడం ద్వారా శక్తిని సమకూర్చుకోవాలని కాలచక్రతంత్రం బోధిస్తోంది. రాగద్వేషాలు మనోబలాన్ని నశింప చేస్తాయన్న మాట!

6. ప్రజ్ఞాపారామిత సూత్రాలు అంటే యుక్తాయుక్త వివేకాన్నిచ్చే విషయాలు అని అర్థం (FAR REACHNG DISCRIMINATING AWARENESS SUTRAS). వీటిని బుద్ధుడి బోధనలతోను, ఇతర బౌద్ధసూత్రాలతోనూ, కాలచక్ర సూత్రాలతోనూ పోలుస్తూ తక్కువ చేసి మాట్లాడినప్పుడు సాధకుడు విఫలం అవుతాడు. ఆధిపత్య భావంతో, ఆగ్రహావేశాలకు లోను కావడం కూడా జరగవచ్చు. అది కూడ పతన కారణమే!

7. తంత్ర రహస్యాల్ని కాపాడుకోగలగాలి. కాలచక్రతంత్రంలో సాధారణ ప్రజలకు ఎంతవరకు అవసరమో అంతవరకే వెల్లడిస్తారు గాని, అయోగ్యులకు, అనామకులకు, అనర్హులకు వీటిని చెప్పి విలువని చంపు కోవడం ద్వారా సాధకుడు తనకు తాను అపకారం చేసుకున్న వాడౌతాడంటుంది కాలచక్రతంత్రం.

8. సాధకుడు కాలచక్రతంత్ర అభ్యాసం ద్వారా తాను పొందిన దాన్ని బుద్ధుడి అంకెల్లో గుణించుకోవాలి. ఈ-దమ్ (Yi-Dam) అంటారు ఈ గుణకారాన్ని. అలా తెలుసుకోవడాన్ని లోతైన అవగాహన (DEEP AWARENESS) ని "యె-షేస్" (Ye-Shes) అంటారు. తాను ఎంత కష్టపడినా తన "ఈ-దమ్" పెరగలేదని తిట్టుకోవడం మొదలుపెట్టిన వాడు మళ్ళీ వ్యతిరేక ఆలోచనల్లోకి వెళ్ళినట్టే అవుతుంది కదా... అందువలన సాధించిన గుణకారాల్లో మరికొన్నింటిని నష్టపోతాడన్నమాట!!

9. సాధకుడు ఆత్మ పరిశుద్ధతపై విశ్వాసం కలిగి వుండాలి. మాధ్యమిక వాదాలలో చిత్తమాత్ర అనే విధానం వుంది. ఎవరితోనైనా విభేదం ఏర్పడి, అది సర్దుకున్నాక "నా మనసులో ఏమీ లేదు" అంటాం కదా! మనసులో ఏమీ లేని స్థితి నిజంగా వుండగలగడం గురించి ఈ చిత్తమాత్ర బోధిస్తుంది. 'VOIDNESS' అంటారు దీన్ని. శూన్య మనస్కుడిగా వుండాలి సాధకుడు. మనసును సంస్కరించి శుద్ధి చేసినప్పుడే ఈ శూన్యస్థితి ఏర్పడుతుందని మనం ముందే వివరంగా చర్చించుకోవడం జరిగింది. ఈ ఆత్మశుద్ధి పైన విశ్వాసం సన్నగిల్లినప్పుడు సాధకుడు పతనం వైపు నడుస్తాడు. అతను ఆత్మశుద్ధి పొందలేక పోయాడని అర్థం.

10. "కపట ప్రేమ" (Deceitful Love) సాధకుడికి ఎప్పుడూ అపకారం చేస్తుంది. సత్యప్రేమ అతన్ని సాధకుణ్ణి చేస్తుంది. మనసులో పగని పెట్టుకొని, పైకి ప్రేమను ప్రదర్శించినా (Hipocricy) సాధకుడు నష్టపోతాడు. సాధకుడిలో ఈ ద్వంద్వ ప్రవృత్తి వుందని మనకి తెలియక పోవచ్చు, కాని, ఫలసిద్ధికి తెలుసు సాధకుడు ఏమిటో...!

ఇవన్నీ మానవ సహజం లక్షణాలు. మనసనేది ఒక నిరంతర ఆలోచనల ప్రవాహం. ఈ ప్రవాహం లోకి మన చైతన్యం (Subconscious Mind) ఏ క్షణాన వెడితే, ఆ క్షణంలో అక్కడ ఏ ఆలోచన వుంటే అది మన స్మృతి పథంలోకి వస్తుంది. మామూలు మనుషుల విషయంలో అలా ఆలోచనలు రావడాన్ని తప్పు పట్టడం కన్నా, ఆ ఆలోచనలతో జీవించడాన్ని తప్పు బట్టాలి.

కానీ సాధకుడు విషయం అలాంటిది కాదు. నిత్యం ప్రార్థనల్లో వుంటూ, బౌద్ధ ధర్మాల పట్ల పూర్తి విశ్వాసంతో వున్నప్పుడు ఇలాంటి ఆలోచనలు కలిగే అవకాశం మెదడుకుండదు. మనసంతా కాలచక్రతంత్రం నిండి పోయిన వాడికి వ్యతిరేక ఆలోచనలకు చోటు వుండదు కదా!

11. మొదట మనం చెప్పుకున్న చిత్తమాత్రత గురించి. ఎటువంటి రాగద్వేషాలు లేని శూన్య స్థితి గురించి. ఆ శూన్యత మీదే మనసును లగ్నం చేసి ధ్యాన్నం చేస్తున్నప్పుడు మనసు విరాగంగానే ఉంటుంది. అందులో ఆలోచనా జలాలు ప్రవేశించలేవు. ప్రవేశించాయంటే, ధ్యాన్నం కుదరనట్టే లెక్క!

12. ఇతర సాధకుల్ని పవిత్రాత్మలుగా భావించి గౌరవించడం సాధకుడి ముఖ్య లక్షణం. అసూయా ద్వేషాలతో వారి పట్ల వ్యవహరించడం, వారి విధానాలలో

తప్పులు పట్టడం వంటివి సాధకుడి మనో నిబ్బరాన్ని దెబ్బతీస్తాయి. ఇవన్నీ వ్యతిరేక ఆలోచనా విధానంగానే భావించాలి. నెగెటివ్ తరహా మనస్తత్వం వున్న వాడు కాలచక్రతంత్రం మొదటి అంచుల్లోకి కూడా పోలేడు.

13. కాలచక్రతంత్రాన్ని సాధించడానికి సానుకూల పడే అంశాల్ని గుర్తించి సద్వినియోగం చేసుకోవాలి. తనచుట్టూ అనుకూల వాతావరణం సృష్టించుకోవాలి. తన ప్రశాంతత తన వలన ఇతరులకు ప్రశాంతతనిస్తుంది కదా! అలా ప్రశాంతతని ప్రసాదించుకోగలిగే వాడే సాధకుడు కాగలుగుతాడు.

మనం సరదాగా చెప్పుకుంటూ వుంటాం... కొందరు చుట్టాలు వచ్చి సంతోషపెడతారు. కొందరు చుట్టాలు వెళ్ళిపోయి సంతోషపెడతారని- అలా వెళ్ళిపోయి మనకి సంతోషం కల్గించే వ్యక్తులు ఎలాంటి వారో చెప్పనవసరంలేదు కదా... కాలచక్రతంత్ర సాధకులు వచ్చి సంతోష పెట్టే వారుగా వుండాలన్న మాట.

14. స్త్రీ గౌరవం అనేది బౌద్ధ ధర్మాలన్నింటిలోనూ అతి ముఖ్యమైన విషయం. Deviding Women - స్త్రీలను అవహేళన చేయడం, తక్కువగా చూడడం, ఆడది-అని అగౌరవ పరచడం కార్య సాధకుడిలో వ్యతిరేక లక్షణాలుగా నిలబడతాయి. మాతృ భావంతో మరలిపోయే మనస్తత్వం వున్నవాడే సాధకుడు కాగలుగుతాడు!!

ఈ పధ్నాలుగు సూత్రాలూ కాలచక్రతంత్రానికి మూలసూత్రాలుగా చెప్తారు. ఇలాంటి సహజ లక్షణాలు వున్నవారికే ఈ కాలచక్రతంత్ర అభ్యాసం చేయగలిగే అదృష్టం లభిస్తుందనేది ఇక్కడ ముఖ్య విషయం!!

ఎలాంటి వారు సాధకులు కాగలుగుతారో ఈ సూత్రాలని అధ్యయనం చేస్తే అర్థం అవుతుంది!

ఇవి కేవలం కాలచక్రతంత్ర సాధకులకే కాదు- మామూలు మానవమాత్రులు కూడా వీటిని ఆచరణలో పెట్టి ఉన్నత సంస్కారాన్ని ప్రదర్శించగలగవచ్చు కదా... అలాంటి వారికే ఎప్పటికైనా కాలచక్రతంత్ర దీక్ష తీసుకునే అవకాశం వస్తుందని ఇక్కడ ముఖ్యంగా చెప్పవలసింది వుంది.!

# అమరావతిలో దొరికిన బౌద్ధ తాంత్రిక దేవతల విగ్రహాలు

తాంత్రిక బౌద్ధ ధర్మాల గురించిన అవగాహన మనకు చాలా తక్కువ. జ్ఞాన మార్గాన్ని ప్రబోధించిన బుద్ధుడిగా మాత్రమే మనకు బుద్ధుని గురించిన ఒక అవగాహన వుంది.



**అమరావతిలో దొరికిన కాలపురుషుని విగ్రహం**

మన గ్రంథ రచయితలు, పరిశోధకులు కూడా, తాంత్రిక బౌద్ధ ఆరాధనలోని ప్రాముఖ్యతని అంచనా వేయడంలో పెద్ద లోతుల్లోకి వెళ్ళినట్లు కన్పించదు. అశ్వఘోషుడు, నాగార్జునుడు, ఆర్య దేవుడు ఇలాంటి బౌద్ధ ధర్మ ప్రవర్తకులు కూడా తాంత్రిక బుద్ధుని గురించి ఏం చెప్పారో మనకు అంతగా ప్రచారంలో లేదు. వాళ్ళ గ్రంథాలు టిబెట్‌లో వున్నంతగా మన దగ్గర లేవు.

9వ శతాబ్దిలో శాంతిదేవుడు రాసిన శిక్ష సముచ్చయం గ్రంథంలో బౌద్ధ తాంత్రిక గురువుల ప్రస్తావన వుంది. అక్షోభుడు, అమితాభుడు వీళ్ళు ఆ రోజుల్లో తథాగతులుగా ప్రసిద్ధి పొందిన వ్యక్తులు.

తాంత్రిక బుద్ధుడి ప్రతిమలతో అష్టాక్షరిక, ప్రజ్ఞాపారామిత, పంచరక్ష, సాధనమాలా... మొదలైన తాంత్రిక గ్రంథాలు వెలుగు లోకి వచ్చాక ఒక నాటి బౌద్ధ తాంత్రిక విద్యల గురించి అవగాహన ఏర్పడసాగింది పరిశోధకులకి!

అమరావతి త్రవ్వకాలలో ఇలాంటి బౌద్ధ తాంత్రిక ప్రతిమలు కొన్ని దొరికాయి.

ఈ బౌద్ధస్తూపం క్రీస్తు శకం తొలి శతాబ్దాల కాలం నాటిదే అయినా, ఇక్కడ దొరికిన తాంత్రిక ప్రతిమలు 8-9 శతాబ్దాల నాటివి కావచ్చని తెలుగు పరిశోధకుడు కె.కృష్ణమూర్తి గారు పేర్కొన్నారు.

కాలచక్ర తంత్రం బుద్ధుడి జీవిత కాలంలోనే, బుద్ధుడి ద్వారానే ధాన్య కటకంలో ప్రారంభం అయ్యిందని టిబెట్ గ్రంథాల ఆధారంగా మనకు తెలుస్తున్నట్లు ముందే చెప్పుకున్నాం. ఆ తర్వాత ఇంచుమించుగా వెయ్యేళ్ళు జరిగిపోయాయి. బౌద్ధం చివరిదశనాటి తాంత్రిక శిల్పాలు కూడా ఇక్కడ బయలు పడడం ఒక విశేషం.

ఆంధ్రప్రదేశ్ ఆర్కయివ్స్ వారి జర్నల్ "ఇతిహాస్"లో, 1977లో శ్రీ కె.కృష్ణమూర్తి అమరావతి లోని తాంత్రిక ప్రతిమల గురించి చాలా విలువైన వివరాలు అందించారు. అమరావతిలో దొరికిన తాంత్రిక విగ్రహాల బొమ్మనీ, టిబెట్ బౌద్ధులు ఆధునికంగా ఆరాధిస్తున్న చిత్రాల్ని ఇక్కడ ఇస్తున్నాను. పోల్చి చూడవచ్చు.

## తాంత్రిక బుద్ధుడు

ఇది 17×9×2 అంగుళాల విగ్రహం. వజ్ర పర్యాంక ఆసనం వేసుకొని కూర్చుని వున్న శిల్పం ఇది. కుడి చెయ్యి నేలను తాకుతూ భూ స్పర్శ ముద్రతో వుంటుంది. భూమిని స్పృశించి, ఆవాహన చేయడం దీని అర్థం. ఎడం చెయ్యి ఒడిలో పెట్టుకొని

వుంటాడు. పద్మాసనం మీద కూర్చుని వుంటాడు. పద్మం క్రింద ఒక స్త్రీ పుష్పాలు అర్పిస్తూ వుంటుంది. బహుశా ఆమె భూమాత కావచ్చు. చెవి కమ్మలు (లోలాకులు) సాగి, భుజాల మీదకు వ్రేలాడుతూ ఉంటాయి. ఎడమ భుజం మీదకు వలెవాటు వేసి వుంటుంది. ఈ బుద్ధునే టిబెట్ బౌద్ధులు 'మెడిసిన్ బుద్ధ' అంటారు.



ఈ తాంత్రిక బుద్ధుడు ఆది బుద్ధుడు కాకపోవచ్చు. ఏడుగురు బుద్ధులలో చివరివాడు కావచ్చునంటారు కృష్ణమూర్తి గారు.

సాధారణంగా పద్మాసనం కింద ఏనుగు బొమ్మ గానీ, గుర్రం గానీ, ధర్మచక్రం గానీ, ఖడ్గ ధారులు గానీ, ముకుళిత హస్తాలతో వున్న స్త్రీ గానీ, ధనిక వర్తకుడు గానీ చెక్కబడి వుంటారు. గడ్డాలున్న ఒక వ్యక్తి పుర్రెలతో సహా చెక్కినవి కూడా వున్నాయి.

'సాధన గ్రంథమాల' అనే బౌద్ధ గ్రంథంలో, భూస్పర్శ ముద్రలో వున్న బుద్ధుడు ఎర్రని దుస్తులు ధరించి వుంటాడనీ, శాంత మూర్తిగా అవుపిస్తాడనీ, శరీరం మీద బౌద్ధానికి సంబంధించిన పవిత్ర గుర్తులు చెక్కబడి వుంటాయని వివరణ వుంది.

## మైత్రేయుడు

ఇదికూడా 12×11×2 1/2 అంగుళాల విగ్రహం. అమరావతిలో దొరికిన తాంత్రిక విగ్రహాలలో ముఖ్యమైంది. ఆయన కూర్చున్న భంగిమని తాంత్రిక భాషలో ప్రత్యలిధాసనం అంటారు. కుడిచేయి వరద ముద్రతో వుంది. అంటే అభయ హస్తంలా వున్నదన్నమాట! ఎడమ చేతిలో పెద్ద పువ్వులా కనిపించేది నాగకేసర పుష్పం. ఎడమ కాలు పాద పీఠం మీద వాల్చి వుంది. బంగారు కమలాలు, కంఠాభరణం, కేయూరం, మేఖల వగైరా ఆభరణాలు ధరించి వుంటాడు.

మైత్రేయుడు అంటే స్నేహం కోరేవాడు.! ఈయన సాధన చేస్తున్నాడని, భవిష్యత్ బుద్ధుడు ఆయనేననీ హీనయాన బౌద్ధ గ్రంథంలో వుంది. కానీ, మహాయాన బౌద్ధంలో మైత్రేయుడు ఒక గొప్ప తాంత్రిక ప్రతిమ... కాలచక్రతంత్రం, వజ్రయాన బౌద్ధాలలో ఆయన ముఖ్యమైన తాంత్రిక దేవత. ఐదుగురు మహా బుద్ధులలో ఈయన ఒకడని ఇంకో గ్రంథంలో రాసి వుంది. ఈ విగ్రహానికి క్రింది భాగంలో రెండు చేతులూ జోడించిన ఒక వ్యక్తి ప్రతిమ కన్పిస్తుంది. ఆ వ్యక్తి "దానపతి!" అంటే ప్రధాన దాత! అనీ ఈ తాంత్ర విద్యలకు ప్రధాన పోషకుడు. ఆయన వెనక, ఒక చైత్యం బొమ్మ చిత్రించబడి వుంది గమనించండి. బుద్ధుడి ప్రతిమకీ, మైత్రేయి ప్రతిమకీ మౌలికమైన తేడా వుంది. చేతిలో పద్మం ధరించిన వాడు గౌతమ బుద్ధుడు. చేతిలో నాగకేసర పుష్పాన్ని ధరించి, వెనకాల చైత్యం వున్న ప్రతిమ మైత్రేయుడుది!

ఐదు మంది బుద్ధులని కొందరు, ఏడుగురు బుద్ధులని కొందరు విడివిడిగా చెప్పినప్పటికీ, ఈ ఐదుగురు లేక ఏడుగురూ స్వర్గంలో వున్నారు. భవిష్యత్ బుద్ధులుగా



ఎప్పుడో ఒకసారి మళ్ళీ వస్తారు. అలా వచ్చేందుకు తగిన సమయం కోసం వారు అక్కడ ఎదురు చూస్తూంటారట! హీనయాన బౌద్ధులు, మహాయాన బౌద్ధులు ఇద్దరూ మైత్రేయుణ్ణి సమానంగానే ఆరాధిస్తారు.

హీనయానులు రాబోయే బుద్ధుడి గానూ, మహాయానులు తాంత్రిక బుద్ధుడు గానూ, మైత్రేయుణ్ణి గౌరవిస్తారు.

అశోకుడి కాలంలోనే క్రీస్తు పూర్వం 3వ శతాబ్ది నాటికే మైత్రేయ ఆరాధన వుంది. క్రీస్తు శకం ఐదవ శతాబ్ది నాటికి మైత్రేయ ఆరాధన బాగా పెరిగి 9, 10 శతాబ్దాల దాకా సాగిందని అంటారు.

టిబెట్‌లో మైత్రేయుడి ఆరాధన ఎక్కువ. చైనాలో ఎక్కడ పడితే అక్కడ మైత్రేయుడి విగ్రహాలు దొరికాయట. నిల్చుని వున్న మైత్రేయుడు, కూర్చుని వున్న మైత్రేయుడు విగ్రహాలు రెండూ వున్నాయిట.

"మంజువగ్ర మండలం" గ్రంథంలో బోధి సత్వులందరికన్నా మైత్రేయుడి ప్రాధాన్యత ఎక్కువ- అంటారు.

నాలుగు చేతుల మైత్రేయుడి రూపానికి ఈ మంజువగ్ర మండలంలో ఆరాధిస్తారు. మామూలు చేతులు రెండూ ధర్మచక్ర ముద్రని కలిగి వుంటే అదనపు చేతులు రెండూ వరదముద్రలో వుంటాయి. అంటే, అభయహస్తాలుగా వుంటాయన్న మాట!

## పద్మపాణి బుద్ధుడు

ప్రత్యయిద ఆసనంలో కూర్చుని వున్న ఈ పద్మపాణి విగ్రహం అమరావతిలో దొరికింది. ఇవి రెండు దొరికాయి. ఒకటి బుద్ధుడితో కలిసి కూర్చుని వున్నది. రెండవది బుద్ధుడు, మైత్రేయుడూ ఇద్దరితో కలిసి కూర్చుని వున్నది. రెండింటినీ ఇక్కడ మీరు గమనించవచ్చు. కుడిచెయ్యి వరద ముద్రతో వుంటుంది. ఎడమచెయ్యి 'వితరక ముద్ర'లో వుంటుందిట. ఇవన్ని తాంత్రిక పారిభాషిక పదాలు. వాటికి తంత్ర విద్య పరంగా చాలా ప్రాముఖ్యత వుండి వుంటుంది. వితరక ముద్రలో మధ్య వేలు, ఉంగరం వేలు ముడిచి వున్నాయి. తామర పువ్వు కాడని ముడిచిన, రెండు వేళ్ళతో పట్టుకున్నట్లుంది. ఐదు ఆకులు చిత్రించిన కిరీటం, భుజాలు తాకే కర్ణ కుండలాలు, కంఠాభరణం, వగైరా అలంకారాలతో ఈ విగ్రహం మలచబడి వుంది.

ఈ పద్మపాణి అవిలోకితేశ్వరుడి అవతారం అనీ, సమస్త జీవరాసినీ ధ్యాన బుద్ధుడు, అమితాభుల ఆజ్ఞ మీద, ఈయనే సృష్టిస్తాడని తాంత్రికుల నమ్మకం.

విశ్వపావి లేదా విశ్వపిత తిరిగి మరో సృష్టిని సృష్టించే వరకూ ఈ పద్మపాణి బుద్ధుని ధర్మాల వ్యాప్తిని కొనసాగిస్తాడని బౌద్ధుల విశ్వాసం.

టిబెట్ జపాన్ బౌద్ధ గ్రంథాలలో పద్మపాణి చాలా ప్రముఖమైన దేవత.

ఇక్కడ కూడా పద్మపాణిని తెలుగువారు బాగా ఆరాధించే వారే కాబట్టి, బుద్ధుడు, మైత్రేయుడు పద్మపాణి ముగ్గురూ కలిసి ఒకే విగ్రహంగా వున్నవి అమరావతిలో దొరికాయి. అయితే గడిచిన వెయ్యేళ్ళ కాలంలో బౌద్ధ ధర్మాలు అంతరించి పోయి, బౌద్ధ గ్రంథాలు నశించి పోయి, తెలుగు వారికి తమ పూర్వ దేవతల గురించి ఏమీ తెలియకుండా పోయింది!



కె.కృష్ణమూర్తిగారు చెప్పిన అమూల్యమైన విషయం ఏమంటే, నాగులకు పద్మపాణి చాలా ముఖ్యమైన దేవత అని! నాగులకు బౌద్ధంతో గల సంబంధాల కారణంగా నాగుల దేవతలు బౌద్ధుల దేవతలుగా మారడం సహజ పరిణామం.

బుద్ధుడు తెలుగువారితో సంబంధాలు ఏర్పరచుకొని, ధాన్యకటకానికి రావడానికి ముందు నాటి తెలుగువారి స్వంత దేవతలు బౌద్ధ దేవతలుగా కాలక్రమంలో మారి ఉంటారని మనం వూహించవచ్చు కూడా!

సింహళ దేశీయులక్కూడా పద్మపాణి ఆరాధన వుండేదిట. అక్కడ కూడా 9-10 శతాబ్దాల నాటి పద్మపాణి విగ్రహాలు దొరికాయి. అవి కృష్ణాతీరం నుంచే సింహళ దేశాలకు వెళ్ళాయనడానికి తగిన సాక్ష్యాలు ఉన్నాయి.

## హేరుక

అమరావతిలో దొరికిన పది అంగుళాల పొడవు ఏడు అంగుళాల ఎత్తు రాతి విగ్రహం అర్ధ పర్యాంక ఆసనంలో వున్న హేరుకునిదని పరిశోధకులు తేల్చారు. కుడి చేతిలో వజ్రాయుధం పుచ్చుకొని వుంటాడు. ఎడమ చేతిలో మానవ కపాలం వుంది. ఎడమ భుజం మీంచి ఖట్వాంగం యజ్ఞోపవీతంలా వుంది చెవులకు కుండలాలున్నాయి. మెడలో ఎముకల దండ వుంది. ఇతర ఆభరణాలతో అలంకృతమైన విగ్రహం ఇది. పాదం దాక పంచె కట్టు వుండి, చివరన రెండు పాదాలకు మేఖలాలున్నాయి. ఎర్రటినేత్రాలు, రౌద్రమూర్తి.

సాధన మాలలో ఈ హేరుక మూర్తి గురించి వున్నట్లు శ్రీ కృష్ణమూర్తి తెలిపారు. బుద్ధత్వాన్ని పొందడం కోసం తాంత్రికులు హేరుక మూర్తిని ఆరాధించేవారట!

హేరుక విగ్రహం చాలా అపూరూపమైందని, నేపాల్ లోనూ, కొమిల్లాలోనూ మాత్రమే వున్నాయనీ, దక్షిణ భారతదేశంలో అమరావతిలో మాత్రమే దొరికిందని ఆయన తెలిపారు.

సాధన మాలలో 'హేరుక'కు సంబంధించిన సాధనలు చాలా వున్నాయి. మానవ చర్మంతో చేసిన వస్త్రాన్ని ధరించిన రూపం, నీలిరంగు శరీరం, పుర్రెల దండతో శిరస్సు అలంకరణ, అగ్నిజ్వాలలాగా లేచి నిల్చున్న జుట్టు, రక్తవర్ణ నేత్రాలు, పేగులతో పుర్రెల్ని చుట్టి అల్లిన దండ మెడలో వ్రేలాడుతూ, మహా భయంకరమైన రౌద్ర మూర్తిగా ఈయన్ని సాధన మాల గ్రంథం అభివర్ణించింది. కుడిచేతిలో పిడుగుని, ఎడమ చేతిలో పుర్రెని పుచ్చుకుని వుంటాడట హేరుక మూర్తి. ఎడమ భుజం మీంచి ఉత్తరీయం మీద కూడా పుర్రెల గుర్తులు జంధ్యం లాగా వ్రేలాడి ముద్రితమై వుంటాయి. విశ్వపద్మం మీద ఎడమ కాలుని వుంచి కుడి కాలుని ఎడమ తొడ దాక తెచ్చి ఆన్చి వుంచి నిల్చుని నృత్యం చేసే రూపం... ఇది!



సమస్త దుష్ట శక్తుల్ని నాశనం చేసి సాధకుడిలో బుద్ధత్వాన్ని సాధించడం కోసం తాంత్రికంగా ఈ మూర్తిని ఆరాధించేవారు. అమరావతిలో ఈ మూర్తి విగ్రహం దొరకడం ఇక్కడి తాంత్రిక విద్యల ప్రత్యేకతని సూచిస్తుంది.

## జంభల

బంగారు వర్ణం కల్గి, పెద్ద పొట్ట వున్న విగ్రహం జంభల దేవతది! కుడి చేతిలో నిమ్మ పండు, ఎడమ చేతిలో ఆడ ముంగీస వుంటాయి. ఇవి ఈ విగ్రహం ప్రత్యేకతలుగా సాధన మాల గ్రంథంలో వర్ణితమై వుంది.



అమరావతిలో దొరికిన జంభల విగ్రహంలో ఈ రూపాలన్ని దాదాపుగా ధ్వంసం అయి, మధ్య శరీరం మాత్రమే కన్పిస్తోంది.

## శ్యామతార

అమరావతిలో దొరికిన స్త్రీ తాంత్రిక దేవత 'శ్యామతార'కు సంబంధించిన 17×12×4 అంగుళాల విగ్రహం. పద్మం పైన లలితాసనంలో కూర్చున్న విగ్రహం



ఇది. 'తల' తప్ప మిగిలిన విగ్రహం అంతా స్పష్టంగా కన్పిస్తోంది. కుడిచెయ్యి వరద ముద్ర! ఎడమ చెయ్యితో నీలి కలువపువ్వు పొడవైన కాడని పట్టుకొని వుంటుంది! "నీలోత్పలధారి" అన్నమాట. మెడలో వ్రేలాడే కంటి, ఏకావళి, భుజకీర్తులు, కేయూరాలు, ప్రాకోస్త వలయాలు, కాళ్ళకు కంకణాలు... సర్వాలంకృత విగ్రహం ఇది. కట్టుకున్న వస్త్రం ముడతలు స్పష్టంగా చెక్కి వున్నాయి.

'తార' ని టిబెట్ బౌద్ధంలో "స్త్రీ బోధిసత్వ"గా పిలుచుకొంటారు. రక్షణ నిచ్చే దేవత (SAVIORESS) అని దీని అర్థం. అవలోకితేశ్వరుడి కన్నీళ్ళలోంచి ఈ 'తార' పుట్టిందని భావిస్తారు.

కరుణకు అవలోకితేశ్వరుడు ప్రతిరూపం. ఆయన కళ్ళలోంచి అంటే, కారుణ్య దృష్టిలోంచి 'తార' పుట్టిందని దీనికి మనం భాష్యం చెప్పుకోవాలి.

"తార"ని ఆరాధించే పద్ధతులు టిబెట్‌లో ఇప్పటికీ కొనసాగుతున్నాయి. ఒకప్పుడు తెలుగు వారికి కూడా ఈ తాంత్రిక ఆరాధన వుండేదనడానికి అమరావతిలో తారకు సంబంధించిన విగ్రహం దొరకడమే సాక్ష్యం. 'తార'కు 21 వేల రూపాలు వున్నాయిట. ఈ "శ్యామతార" అందులో ఒకటి కావచ్చు.

సందర్భం కాకపోయినా, ఇక్కడ ఒక విషయం గమనించాలి... బెజవాడ కనకదుర్గ విగ్రహం ఒకప్పుడు తారాదేవి విగ్రహమే కావచ్చని కొందరు పండితులు చాలా సందర్భాలలో అనుమానం వెలిబుచ్చారు. ఆదిశంకరుడు శ్రీ చక్రాన్ని ప్రతిష్ఠించి, ఆమెను శక్తిగా ప్రకటించాడని అంటారు.

బౌద్ధ తాంత్రిక దేవతలు హిందూ దేవతలుగా మారడంలో ఆశ్చర్యం ఏమీ లేదు- బుద్ధుడే విష్ణువు అవతారం అయ్యాడు. బుద్ధుణ్ణి అవలోకితేశ్వరుడు అంటూ ఈశ్వర శబ్దంతోనే కొలిచారు. హిందువులు ఎంతో భక్తితో ఆరాధించే లలితాదేవికి తారాదేవికి సామీప్యత గురించి కూడా పరిశోధకులు అనేక ఊహా గానాలు చేశారు. మతపరమైన అంశాలు సున్నితమైనవి కాబట్టి ఇంత కంటే ఎక్కువ చెప్పడానికి తగిన ఆధారాలు కావాలి. అవి ఏవీ ప్రస్తుతం మనకు అందుబాటులో లేవు అంతే!

## ఉగ్రతార

అమరావతిలో దొరికిన 13 అంగుళాల విగ్రహం ఇది. ఆమె నిలబడిన భంగిమని 'ప్రత్యలీఢాసనం' అంటారు. నాలుగు చేతుల విగ్రహం ఇది. ఒక ఎడమ చేతిలో ఖడ్గం, ఇంకో ఎడమ చేతిలో చురకత్తి వున్నాయి. ఒక కుడి చేతిలో నీలికమలం, రెండో కుడి చేతిలో కపాలం కన్పిస్తాయి. అమరావతిలో దొరికిన ఈ విగ్రహంలో ముఖం స్పష్టంగా కన్పించడం లేదు. ఆమె లలాటం మీద మూడో కన్ను వుంది. మూడు నేత్రాలూ ఉగ్రనేత్రాలే!

సర్వాలంకార భూషితమైన విగ్రహం ఇది. ఒక శవం మీద ఎక్కి నిలబడిన రూపం అది. మెడ నుంచి పుర్రెల దండ పాదాల దాకా వ్రేలాడుతూ వుంటుంది. పొట్టి శరీరం. కానీ, వయసులో వున్న వ్యక్తిలా వుంటుంది.

నేపాల్‌లో వజ్రయోగిని దేవాలయంలో ఈమె రూపాన్ని ఇప్పటికీ ఆరాధిస్తున్నారు.



'కలకత్తా కాళి' ఈ ఉగ్రతార రూపానికి దగ్గరగా వున్న రూపం అనుకోవచ్చు.

మరీచి, మంజుశ్రీ ఇంకా అనేకమంది బౌద్ధ తాంత్రిక దేవతల్ని ఆరాధించే సాంప్రదాయాలు 9-10 శతాబ్దాల వరకూ కొనసాగాయి.

కాలచక్రతంత్రం గురించి తెలుగువారికి అంతగా పరిచయం లేకపోవడాన బౌద్ధమత తాంత్రిక దేవతల పరిచయం కూడా మనకు లేకుండా పోయిందని ముందే చెప్పుకున్నాం.

బౌద్ధం పతన దశలో వున్న రోజుల్లో కూడా తాంత్రిక బౌద్ధం బాగా విస్తరించి వుండేది. ఈ తాంత్రిక పద్ధతులు, తాంత్రిక చర్యల్ని జనబాహుళ్యం హర్షించి వుండక పోవచ్చు. బౌద్ధ భిక్షువుల చర్యలు చాలా సందర్భాల్లో అపోహల్ని కల్గించి వుంటాయి కూడా.

బౌద్ధారామాలు నిర్మానుష్యమై పోషణ లేక కూలి నశించి పోయాయి. వరదల ముంపులు, భూకంపాల తాకిడి కూడా వాటి నాశనానికి కారణాలు కావచ్చు. అన్ని సందర్భాల్లోనూ శైవులో, జైనులో, మహమ్మదీయులో కావాలని కూలగొట్టారనడం కూడా వాస్తవం కాకపోవచ్చు. నశించిపోయే పరిస్థితుల్లోనే అధిక భాగం బౌద్ధారామాలు నశించి పోయాయి. శైవులు కొన్నింటిని ఆక్రమించి శైవారామాలుగా పోషించి బతికించి వుండవచ్చు.

అనేక బౌద్ధ తాంత్రిక దేవతలు హిందూ దేవతలుగా మారడానికి ఇలాంటి పరిణామాలే కారణం కావచ్చు కూడా!!

# శక్తి మంతులైన లోకోపకారకులు సాధకులు

బౌద్ధ ధర్మాలను విశ్వసించి, ఆచరించి బుద్ధత్వాన్ని పొందడానికీ, కాలచక్ర మార్గాన సాధన చేసి బుద్ధత్వాన్ని పొందడానికి చాలా తేడా వుంది. బౌద్ధ ధర్మాలు శరీరాన్ని, జ్ఞానాన్ని ఐక్యం చేస్తాయి. కర్మ- జ్ఞానమూ రెండింటినీ సంలీనం అయ్యేలా చేస్తాయి. కానీ, కాలచక్ర మార్గాన వెళ్ళినప్పుడు- ఈ రెండింటి సంలీనంలోంచి శక్తిని ఉత్పత్తి చేసుకొని, దాని సహాయంతో బుద్ధత్వం (ENLIGHTENMENT) పొందేలా సహకరిస్తుంది. అందుకని, కాలచక్ర సాధన "శక్తిమంత మైన ప్రజ్ఞాపథం"గా చెప్పడం జరిగింది.

యోగ తంత్రాలలోకెల్లా కాలచక్రతంత్రం అత్యున్నతమైనదిగా ఈ తంత్ర సాధకులు భావిస్తారు. ఎందుకంటే, మహోన్నత జ్ఞానసిద్ధిని పొందడమే ఈ తంత్రం పరమ లక్ష్యం కాబట్టి! కనీసం ఈ లక్ష్యాన్ని అర్థం చేసుకోగలగడం కూడా ఒక సాధన గానే పరిగణిస్తారు.

అనుకూల మనస్తత్వం (POSITIVE ATTITUDES) వున్నవారికే కాలచక్ర తంత్రం సిద్ధిస్తుంది. స్వచ్ఛమైన మనసుతో కాలచక్ర దీక్షా ప్రదాన కార్యక్రమాల్ని సందర్శించే వారిలో కూడా అనుకూల కర్మ ప్రవృత్తులు (POSITIVE KARMIC INSTINCTS) ఉత్పత్తి అవుతాయని కాలచక్ర సాహిత్యం వివరిస్తోంది. అయితే, కాలచక్రం వలన పొందే ఈ అనుకూల ప్రవృత్తులు మన స్వంతానికి లాభించేవిగా వుండవు. మన వలన లోకానికి మేలు కల్గించేవిగా వుంటాయి. పాజిటివ్ ఆలోచనా విధానం అంటే లోకోపకారకమే కదా!

ఈనాటి మన సామాజిక రుగ్మతలకి, చాలా శక్తిమంతమైన ఔషధం కావాలి. బుద్ధుడు బోధించి, చూపించిన మార్గాలలో కెల్లా శక్తిమంతమైనది కాలచక్ర యోగతంత్రమే! సమాజం

మొత్తాన్ని ఒకేసారి సంస్కరించగలగడం సాధ్యం కాకపోవచ్చు. కానీ, వ్యక్తులలో వ్యక్తిగత పరివర్తన సాధించగలగడం తేలిక. దాన్ని కాలచక్రమార్గంలో సాధించినప్పుడు, పరివర్తన పొందిన వ్యక్తి శక్తిమంతుడు అవుతాడు. లోకోపకారి కూడా అవుతాడు.

కాలచక్ర తంత్రయోగ సాధన ఆశిస్తున్న ప్రయోజనం ఇదే! తెలుగు నేల మీద 2550 సంవత్సరాల తర్వాత మొదటిసారిగా జరుగుతున్న ఈ కాలచక్ర తంత్ర దీక్షా ప్రదాన కార్యక్రమం గురించి, కాలచక్ర తంత్రం గురించి, దాని ప్రాశస్త్యం గురించి వివిధ గ్రంథాలలోని సమాచారంతో పాటు పెద్దల నుంచి సేకరించిన విశేషాలను ఈ గ్రంథంలో పొందుపరుస్తున్నాను. ఆస్వాదించగలరని ఆశిస్తున్నాను.

మీ

(డా॥ జి.వి.పూర్ణచంద్)



# కాలచక్రతంత్రం
# 30 మహోత్సవాలు

1. 1954 మే : టిబెట్
2. 1956 ఏప్రియల్ : టిబెట్
3. 1970 మార్చి : ధర్మశాల (ఇండియా)
4. 1971 మే : బైలకుప్పి (ఇండియా)
5. 1974 డిసెంబర్ : బుద్ధగయ (ఇండియా)
6. 1976 సెప్టెంబర్ : లడఖ్ (ఇండియా)
7. 1981 జూలై : మెడిజన్, అమెరికా
8. 1983 ఏప్రియల్ : దిరాంగ్, అరుణాచల్‌ప్రదేశ్ (ఇండియా)
9. 1983 ఆగస్ట్ : లాహోర్, (ఇండియా)
10. 1985 జూలై : రికాన్, స్విట్జర్లాండ్
11. 1985 డిసెంబర్ : బుద్ధగయ, ఇండియా
12. 1988 జూలై : లడఖ్, ఇండియా
13. 1989 జూలై : లాస్ ఏంజెలిస్, అమెరికా
14. 1990 డిసెంబర్ : సారనాథ్
15. 1991 అక్టోబర్ : న్యూయార్క్, అమెరికా
16. 1992 ఆగస్ట్ : కల్ప, హిమాచల్‌ప్రదేశ్, ఇండియా
17. 1993 ఏప్రియల్ : గాంగ్‌టక్, సిక్కిం, ఇండియా
18. 1994 ఆగస్ట్ : జిస్పా, హిమాచల్‌ప్రదేశ్, ఇండియా
19. 1994 డిసెంబర్ : బర్సిలోనా, స్పెయిన్
20. 1995 జనవరి : ముంద్‌గోడ్, ఇండియా
21. 1995 ఆగస్ట్ : ఉలాన్‌బొతోర్, మంగోలియా
22. 1996 జూన్ : టాబో, హిమాచల్‌ప్రదేశ్, ఇండియా
23. 1996 సెప్టెంబర్ : సిడ్నీ, ఆస్ట్రేలియా
24. 1996 డిసెంబర్ : సాలుగార, పశ్చిమబెంగాల్, ఇండియా
25. 1999 ఆగస్ట్ : బ్లూమింగ్టన్, ఇండియానా, అమెరికా
26. 2000 ఆగస్ట్ : హిమాచల్‌ప్రదేశ్, ఇండియా
27. 2002 జనవరి : బుద్ధగయ, ఇండియా
28. 2003 జనవరి : బుద్ధగయ, ఇండియా
29. 2004 ఏప్రియల్ : టోరంటో, కెనడా
30. 2006 జనవరి, అమరావతి, ఆంధ్రప్రదేశ్, ఇండియా

# 30వ కాలచక్రతంత్ర దీక్షా ప్రధాన మహోత్సవం

**(30TH KALACHAKRA EMPOWERMENT)**

టిబెట్‌లో కాలచక్రతంత్రం ప్రచారంలో వుండటానికి వివిధ దలైలామాలు ముఖ్య కారకులు. తక్కిన బౌద్ధ ధర్మాలతో పాటు కాలచక్రతంత్రాన్ని కూడా తరతరాలుగా వారు ప్రముఖంగా భావించి కాపాడుకొంటూ వస్తున్నారు.

ఒకటవ దలైలామా, రెండవ దలైలామా, ఏడు ఎనిమిది దలైలామాలు, ఈనాటి 14వ దలైలామా కాలచక్రతంత్రాన్ని ప్రచారం చేసి ప్రపంచ శాంతిని సాధించడమే ధ్యేయంగా పనిచేశారు. వీరిలో ఈనాటి 14వ దలైలామా ఇప్పటికి 29 కాలచక్ర తంత్ర అక్షరాభ్యాస మహోత్సవాల్ని ప్రపంచవ్యాప్తంగా నిర్వహిస్తూ వచ్చారు.

30వ కాలచక్రతంత్ర అక్షరాభ్యాసాన్ని జనవరి 5, 2006 నుంచి జనవరి 16, 2006 వరకూ గుంటూరు జిల్లా అమరావతిలో ఘనంగా నిర్వహిస్తున్నారు.

ఇది బుద్ధుడికాలంలో 'ధాన్యకటకం'గా పిలవబడిన ఈనాటి అమరావతిలో జరుగుతోంది.

బుద్ధుడు సరిగ్గా ఈ ప్రాంతంలోనే కూర్చుని మొట్టమొదటిసారిగా ఈ కాలచక్ర తంత్రాన్ని శంబల రాజు సుచంద్రుడు తదితర బౌద్ధ ప్రముఖులకు బోధించాడని పండితుల విశ్వాసం. బుద్ధుడి నిర్యాణానికి ఒక సంవత్సరం ముందు ఇది జరిగిందని కూడా పండితుల భావన. ఇప్పటికి "2550" సంవత్సరాలు అయినట్లు భావిస్తూ ఈ సందర్భాన్ని పురస్కరించుకొని ఇక్కడ ఉత్సవాలు నిర్వహిస్తున్నారు.

జపాన్‌కు చెందిన బుష్షోకాయ్ ఫౌండేషన్ వారు చాలా కాలం క్రితమే ధాన్య కటకంలో ఒక కాలచక్ర మహోత్సవాన్ని నిర్వహించాలని కోరినప్పుడు ప్రస్తుత దలైలామా '2006' సంవత్సరాన్ని దీనికోసం కేటాయించారు.

బుష్షోకాయ్ ఫౌండేషన్ వారు స్పాన్సర్లుగా, ధర్మస్థలికి చెందిన నార్బులింగ్‌కా ఇన్‌స్టిట్యూట్ వారు నిర్వాహకులుగా ఈ కార్యక్రమ ఏర్పాట్లు సాగుతున్నాయి. రాష్ట్ర ప్రభుత్వం, జిల్లా పాలనా యంత్రాంగాలు ఎంతగానో సహకరిస్తున్నాయి. ఆరు ప్రముఖ సంస్థలు ఇందుకు తోడ్పడటం కోసం ముందుకు వచ్చి ఒక కమిటీగా ఏర్పడ్డారు. వీరంతా ఏర్పాట్లను పర్యవేక్షిస్తారు.

ఇది బుద్ధుడి నిర్యాణం జరిగిన 2550వ సంవత్సరం. అందుకు గుర్తుగా ఈ కార్యక్రమాన్ని నిర్వహించాలని కూడా నిర్ణయించారు. బుద్ధుడు స్వయంగా నడిచినందువలన పునీతమైన ఈ నేల పవిత్రతని ప్రాశస్త్యాన్ని దృష్టిలో పెట్టుకుని నిర్వహణా భారం చేపట్టారు.

భారతప్రభుత్వం షెడ్యూల్ కులాల జాతీయ కమిటీ సభ్యులు వెన్ లామా లోబ్జాంగ్ అనే ఆయన భారతప్రభుత్వంతో సంప్రదించి ఆర్కియోలాజికల్ సర్వే ఆఫ్ ఇండియా వారి అనుమతిని ఇందుకోసం సంపాదించారు.

జపాన్, నార్బులింగ్ కా ఇన్‌స్టిట్యూట్ వారే అధికారికంగా ఈ కార్యక్రమాలన్నీ నిర్వహిస్తారు. అందుకు కావలసిన పాలనా పరమైన కమిటీలను నిర్ణయించుకొని బాధ్యతల్ని పంచుకొన్నారు.

అలాగే, భారతప్రభుత్వం సాంస్కృతిక వ్యవహారాలశాఖ, దలైలామాతో సంప్రదించి, అత్యున్నత స్థాయి ఇండోటిబెటన్ కమిటీని నియమించడం జరిగింది. వివిధ డిపార్ట్‌మెంట్లకు సంబంధించిన ఆరుగురు సభ్యులతో ఈ కమిటీని విస్తరించారు. నార్బులింగ్ కా సంస్థ ఈ కార్యనిర్వాహక వర్గంతో సంబంధ బాంధవ్యాలు కలిగి ఏర్పాట్లను పర్యవేక్షిస్తుంటుంది.

ఎంతమంది హాజరౌతున్నారో, ఎంతమందికి వసతి సౌకర్యాలు కల్గించాలో తెలియడం కోసం ముందుగా రిజిస్ట్రేషన్ చేయించుకోవలసిందిగా ఏనాడో ఇంటర్‌నెట్ తదితర సమాచార సాధనాలలో ప్రకటించారు. విదేశీయులు, టిబెట్ బౌద్ధులు, హిమాలయాలలోని సాధువులు నార్బులింగ్ కా సంస్థ ద్వారా పేర్లు రిజిస్ట్రేషన్ చేసుకోవచ్చు. సెప్టెంబర్ 2005 ఆఖరు నాటికి రిజిస్ట్రేషన్ పూర్తి కావాల్సి వుందని ప్రకటించారు.

అలా రిజిస్ట్రేషన్ అయినవారికి, ఒక గుర్తింపు కార్డు ఇస్తారు. ఇంటర్‌నెట్‌లోకి వచ్చి చూస్తే రిజిస్ట్రేషన్ ఫారం దొరుకుతుందని కూడా రాశారు.

ముందుగా రిజిస్ట్రేషన్ చేయించుకోలేక పోయినవారికి ప్రత్యేకంగా స్పాట్ రిజిస్ట్రేషన్ ఏర్పాటు చేసే విషయం గురించి ఆలోచిస్తున్నట్లు నిర్వాహకులు పేర్కొన్నారు.

# కార్యక్రమం వివరాలు

**జనవరి 5, 2006 గురువారం** కాలచక్ర తంత్ర సమాయత్తం (Ritual Preparation)

**ఉదయం 7-10 :** భూమికి సంబంధించి బౌద్ధ ఆచారపరమైన వసుధా ప్రార్థనలు (Earth Ritual Prayers) **10-11 :** బౌద్ధ ప్రముఖుల గురించి ఉపన్యాసాలు, **11-12 :** భూమి-ప్రార్థనలు, **మ॥ 12-13 :** భోజన విరామం, **సా॥ 13-4:30 :** భూమి ప్రార్థనలు

**జనవరి 6, 2006 శుక్రవారం** కాలచక్రతంత్ర సమాయత్తం (Ritual Preperation)

**ఉ॥ 7-12 :** ప్రార్థనలు, **మ॥ 12-13 :** భోజన విరామం, **సా॥ 13-14:30 :** భూమికి సంబంధించి బౌద్ధమత ఆచారపరమైన వసుధా నాట్యం- ప్రార్థనలు- నాంగియాన్ బౌద్ధారామానికి చెందిన భిక్షువులచే!, **సా॥ 15-17 :** వివిధ ప్రార్థనలు

**జనవరి 7, 2006 శనివారం** కాలచక్రతంత్ర సమాయత్తం (Ritual Preparation)

**ఉ॥7-12 :** బుద్ధదేవుని ప్రార్థనలు, **మ॥12-13 :** భోజన విరామం, **సా॥ 13-15:** బుద్ధదేవుని ప్రార్థనలు, **సా॥ 15-00:** కాలచక్రతంత్ర ఇసుక మండల చిత్ర నిర్మాణం, **సా॥16-00:** కాలచక్రతంత్ర ప్రదర్శనశాల, మరియు సమాచార కేంద్రం ప్రారంభం

**జనవరి 8, 2006 ఆదివారం** కాలచక్రతంత్ర ప్రాథమిక పరిచయ ప్రసంగం

**ఉ॥ 8-10:** బుద్ధదేవుని ప్రార్థనలు, **10-12:** బుద్ధదేవుని ప్రార్థనలు, **మ॥ 12-13:** భోజన విరామం, **సా॥ 13-16:** ఆచార్య నాగార్జునుడి మాధ్యమికవాదం గురించి బోధనలు (మొదటిరోజు)

**జనవరి 9, 2006 సోమవారం** కాలచక్రతంత్ర ప్రాథమిక పరిచయ ప్రసంగం

**ఉ॥ 8-10:** బుద్ధదేవుని ప్రార్థనలు, **మ॥12-13:** భోజన విరామం, **సా॥13-16:** ఆచార్య నాగార్జునుడి మాధ్యమికవాదం గురించి బోధనలు (రెండవ రోజు)

**జనవరి 10, 2006 మంగళవారం**

**ఉ॥ 8-10:** బుద్ధదేవుని ప్రార్థనలు, **మ॥12-13:** భోజన విరామం, **సా॥ 13-16:** ఆచార్య నాగార్జునుడి మాధ్యమిక వాదం గురించి బోధనలు (3వ రోజు)

**జనవరి 11, 2006 బుధవారం**

**ఉ॥ 7-12 :** బుద్ధదేవుని ప్రార్థనలు, **మ॥ 12-13 :** భోజన విరామం, **సా॥ 13.30-14.30** "అర్పణ" బౌద్ధనృత్యం, **14.30-16.00** ప్రార్థనలు

**జనవరి 12, 2006 గురువారం**

**ఉ॥ 7-12 :** అత్మాభ్యున్నతి కోసం బుద్ధదేవుని ప్రార్థనలు, **మ॥ 12-13 :** భోజన విరామం, **సా॥ 13-16.30 :** నూతన కాలచక్రతంత్ర సాధకులకు దీక్షా ప్రదానానికి సమాయత్తం (Preparation empowerment for students)

**జనవరి 13, 2006 శుక్రవారం**

**ఉ॥ 7-12 :** ఆత్మాభ్యున్నతి కోసం ప్రార్థనలు, **మ॥ 12-13:** భోజన విరామం, **సా॥13-17 :** నూతన కాలచక్రతంత్ర సాధకులకు సాధికారికత ప్రధానం

**జనవరి 14, 2006 శనివారం**

ఇది టిబెట్ కాలమానం ప్రకారం 11వ నెలలో పౌర్ణమి రోజు. బౌద్ధ మత పరంగా చాలా ప్రముఖమైన రోజు.

**ఉ॥ 7-12 :** ఆత్మాభ్యున్నతి కోసం బుద్ధదేవుని ప్రార్థనలు, **మ॥ 12-13 :** భోజన విరామం, సాయంత్రం 13-17 : నూతన కాలచక్రతంత్ర సాధకులకు దీక్షా ప్రదానం

**జనవరి 15, 2006 ఆదివారం**

**ఉ॥7-12:** ఆత్మాభ్యున్నతి కోసం బుద్ధదేవుని ప్రార్థనలు, **మ॥12-13:** భోజన విరామం, **సా॥ 13-17 :** నూతన కాలచక్రతంత్ర సాధకులకు సాధి కారికత ప్రధానం

**జనవరి 16, 2006 సోమవారం** విశ్వ మానవ కోటికీ దీర్ఘాయు సిద్ధికోసం కార్యక్రమం

**ఉ॥ 7-7.30 :** ఆత్మాభ్యున్నతి కోసం బుద్ధదేవుని ప్రార్థనలు, **7.30-9.30 :** విశ్వ మానవులందరికీ ఆయురారోగ్య ప్రధానం, **9.30-12 :** విశ్వాసంతో పరిశ్రమిస్తున్న పవిత్రమూర్తి పూజ్యశ్రీ దలైలామా వారి ఆయురారోగ్యం కోసం ప్రార్థనలు. **12-14 :** భోజన విరామం. **14-15 :** కాలచక్రతంత్ర ఇసుక మండల దర్శనం, **15-00 :** ఇసుక మండల చిత్రానికి ఉద్వాసన, నదీ జలాలలో ఇసుక నిమజ్జనం.

---

# ఆధార గ్రంథాలు


Journal of Telugu Studies : Telugu University
Archaeology of Andhra Pradesh Centenary Volume 1887-1987
ప్రాక్పశ్చిమ తత్త్వ శాస్త్ర చరిత్ర : ప్రథమ సంపుటము ప్రాగ్విభాగము
A to Z of Buddhism : Charles S.Prebish
India in Cylonese History and Culture : M.D.Raghavan
History of Indian Philosophy : Das Gupta
Lokayatha : Devi Prasad Chatopadhyaya
The Ajivakas : Prof.Basham
Secret Doctrine : H.P.Blavetsky
A Comprehensive History of India II (Orient Langmans, London 1957)
Ancient India : H.Sarkar
Every day life in Ancient India : Padminisen Gupta
Tantric Sculptures in Amaravathi : Dr.K.Krishna Murthy


---

# మా సంస్థ నుండి వెలువడిన డా॥ జి.వి.పూర్ణచంద్, BAMS., రచనలు

| వ.నెం. | పుస్తకం పేరు | వెల |
|---|---|---|
| | **వైద్య గ్రంథాలు** | |
| 1. | భోజన భోగం | 50/- |
| 2. | అలనాటి ఆహారములు | 25/- |
| 3. | ఆరు రుచులతో ఆరోగ్యం | 25/- |
| 4. | ఆయుర్వేదంలో చమత్కారాలు | 50/- |
| 5. | నిత్య యవ్వనం | 30/- |
| 6. | ఆయుర్వేదంలో పథ్యాలు-అపథ్యాలు | 30/- |
| 7. | క్విక్‌రెమిడీస్ | 25/- |
| 8. | దీర్ఘాయుష్మాన్‌భవ | 25/- |
| 9. | ఆడవారి కోసం ఆయుర్వేదం | 25/- |
| 10. | ఆరోగ్యామృతం | 50/- |
| 11. | బీపీ వ్యాధి - సులభ నివారణ | 20/- |
| 12. | షుగర్ వ్యాధి - సులభ నివారణ | 25/- |
| 13. | జీర్ణకోశ వ్యాధులు - సులభ నివారణ | 30/- |
| 14. | ఎలెర్జీ వ్యాధులు - ఆయుర్వేద నివారణ | 30/- |
| 15. | కీళ్ళ నొప్పులు - ఆయుర్వేద నివారణ | 30/- |
| 16. | ఆయుర్వేదంలో సులభ చికిత్సలు | 35/- |
| 17. | వంట ఇల్లే వైద్యశాల | 50/- |
| 18. | మీ వ్యాధులకు మీరే వైద్యులు | 90/- |
| 19. | చిరంజీవ! చిరంజీవ! సుఖీభవ! సుఖీభవ! | 40/- |
| 20. | ఆరోగ్య భగవద్గీత | 40/- |
| | **సాహిత్య గ్రంథాలు** | |
| 1. | అలనాటి పట్టణాలు | 50/- |
| 2. | ఆంగ్ల యుగం | 50/- |
| 3. | కాలచక్రతంత్రం | 30/- |
| 3. | దీనజన బాంధవుడు | 40/- |
| 4. | కొసమెరుపులు | 30/- |
| 5. | సభాపర్వం | 30/- |
| 6. | శ్రీగీతగోవిందం | 50/- |
| 7. | పేరులోనే పెన్నిధి | 20/- |
| 8. | మాటల ముచ్చట్లు | 30/- |

## Check List

| | | | |
|---|---|---|---|
| **Book Number** | GVPOID213 | **Date** | 19-11-20 |
| **Front Cover** | yes | **Back Cover** | yes |
| **Blank Pages** | (I), 96, 97 | | |
| **Missing Pages** | NO | | |
| **Prepared** | Mounika | **Scanned** | Swathi |
| **BOOK SIZE** | H 8.5 W 5.4 | **Pages** | 101 |